నం. ౧ శ్రీ

# సాహితి

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి సంపాదించినది



సాహితీసమితి
❀ తెనాలి ❀

చందా రూపాయిన్నర: సంచిక పావలా.




# మేలుకొలుపు

డా. వెంకటసుబ్బయ్య

నీడముల వీడి కలకల నిస్వనములఁ
బాడుచున్నది మేతకై పక్షికులము;
'కొక్కొరోకో' యటంచుఁ గుక్కుటముకూసె;
ఇంక నిద్దుర మేలుకోవేమి, విప్ర?

ప్రాగ్దిశాంచల ప్రస్ఫుటాంగణస్థలమ్ము
ధూమ సంకీర్ణ పావకోద్భూత శిఖలు;
తర్పణాదిక నిరతులై తరలినారు

వృషభగళములఁ సీరముల్ వ్రేగుపఱచి
పోవుచున్నారు కృషికులు పొలములకును
బాపడా, మోముముసుగింక బాపరాదె?

ప్రాతరనిల తరంగ సంపదలఁదోగి
పారవశ్యము నొందితో బ్రాహ్మణుండ?
అఱచుచున్నవి లేగ లంబా యటంచు
పాలు పితికెడి వేళాయె మేలుకొనుము!

ఖరకరుండిదె సోరణగండ్ల నుండి
స్వర్ణరోచిర్మయూఖముల్ పఱపదొడగె
చిన్నికూఁతురు భారతి చేయిబట్టి
లేపుచున్నది, నిదురఁజాలింపుమయ్య! .

# అరిసెముక్కలు

వజ్ఝ బాబురావు

౧

మా నాన్నకు నేను పెద్దకుమార్తెను. నేను పుట్టిన ఏడో రోజునే మాఅమ్మ బాలింత రోగము వచ్చి చనిపోయింది. ఆమె పోయిన పదమూడోరోజునే మా నాన్న మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు నాకు బుద్ధి తెలిసేటప్పటికి మా సవతి తల్లికి ముగ్గురుబిడ్డలు పుట్టినారు.

నాకు పదేళ్ళు వచ్చేదాకా మా నాన్న నా పెళ్ళిమాట తలపెట్టలేదు. మా అమ్మమ్మ పదేపదే చెప్పడముచేత ఇక సాగదని వరుడికోసము వెతకడము ప్రారంభించినాడు. ఆ సంవత్సరము తగిన సంబంధము కుదిరిందికాదని మరుసటి సంవత్సరము వైశాఖమాసములో చెయ్య[illegible]నాడు. మరుసటి వైశాఖములో మా సవతితల్లి ఖాయిలా పడ్డది: నాలుగు నెలలు మంచాన పడి తీసుకొన్నది. ఆఖాయిలాలో ఆమెకు వచ్చేప్రాణము పొయ్యేప్రాణముగా వుండేది. చాలామంది వైద్యులను తెచ్చారు, చాలా మందులు వాడినారు. అందులో భూతవైద్యులు తతంగాల్నూ, తంతులూ చేశారు. వేటివల్లా రోగము తిరిగిందికాదు. గరళముకూడా చివరకు వాడినారు. కొన్నాళ్ళకు నెమ్మదిగా జబ్బు నిమ్మళించించి. ఆమె ఖాయిలాలో వుండగా నా పెళ్ళిమాట ఎవరికి జ్ఞాపకమున్నది? ఇంటికి చూడవచ్చినవారితో మా అమ్మమ్మమాత్రము మా సవతితల్లి జబ్బూ ఇంట్లో ఇబ్బందులూ చెపుతూ నా పెళ్ళియిబ్బందికూడా వారితో కలుపుతూ వుండేది. వైశాఖమాసములో వీలుపడ్డది కాదుగదా అని మాఘమాసములో తప్పకుండా వివాహము చేస్తానని అన్నాడు మా నాన్న. 'ఏమాసములోనైనా డబ్బుఖర్చుచేసి వివాహము చెయ్యవచ్చును, గాని మాస్థితిగతులకు తగిన సంబంధము దొరకవద్దా"? అనేవాడు మా నాన్న చాలాసార్లు. ఏవో వ్యవహారాలమీద ఆయనదగ్గిరికి వచ్చిన ప్రతివారూ, 'బాబూ, అక్కడ సంబంధమున్నది, ఇక్కడ సంబంధ మున్నది,' అన్నచోటికల్లా కబుర్లు పంపి మా నాన్న విచారిస్తూ వుండేవారు. 'ఈసంవత్సరము మేము చెయ్యదలుచుకోలే,' దని కొందరూ, 'అంతవారితో మేము వియ్యపొందగలమా?' అని మరికొందరూ, 'మాఘమాసానికి తూగి రాలే,' మని ఇంకో కొందరూ ఇచ్చే జబాబులు వస్తూవుండేవి. ఈరాయబారాలతో మాఘమాసము సగపడ్డది. వరుడు ఎక్కడా దొరకలేదు. నాకప్పటికి పన్నెండేళ్ళు నిండినవి.

నన్ను చూసినవాళ్ళందరూ, 'ఇంకా ఈపిల్లకు కన్నెచెర వదిలిందికా' దనేవాళ్ళు. నేను కాస్త కాలుపొడుగు

దానను. 'పెళ్ళిఅయిందా?' అనేమాట అడగకుండా చాలామంది నన్ను చూసి, 'కాపరానికి వెళ్ళిందా? లేక ఈయేడు పంపుతారా?' అని మావాళ్ళతో అనేవాళ్ళు. ఇంట్లో మాఅమ్మమ్మగోల యెక్కువయింది 'ఇక అమ్మాయికి వివాహము చెయ్యకపోతే ఎలాగు?' అని మానాన్న స్నేహితులూ, చుట్టాలూ అన్నారు. ఆయన కేమిగాని 'చిందికాదు 'ఎక్కడైనా వరుడు దొరికితే బాగుండును!' అని నిట్టూర్పు విడిచినాడు మానాన్న. చివరకు మావూరిదగ్గర గ్రామములో ఒకసంబంధము కుదిరింది. ఎక్కువ కట్నం మిస్తాననే టప్పటికి ఒక గృహస్థు తనకుమారునికి నన్ను వివాహము చేసుకోడానికి ఇష్టపడ్డాడు!

పెళ్ళికొడుకు కుదిరేదాకా నాకూ మనశ్శాంతి లేదు. 'వైశాఖమాసము లోగా సంబంధము కుదిరితే సరే; లేకపోతేదోవనుపొయ్యేవాడినిపిలిచి నాలుగెకరాలు గట్టుపెట్టి ముడివేస్తా!' అని మానాన్న ఒకసారి అన్నప్పుడు నాప్రాణము చివుక్కుమన్నది. ఎటువంటిభర్త నాకు రాసిపెట్టివున్నాడో అని నాకు దిగులుగా వుండేది. కుదిరిన పెళ్ళివారికి భూవసతి కలదనీ, కరిణీకము వున్నదనీ తెలిసి లోలోపల సంతోషించాను.

అటుతరువాత, పెళ్ళికొడుకు ఎలా వుంటాడో అని ఆందోళన! పెళ్ళివారి ఇష్టాలూ, వారిస్థితిగతులనూ గురించి మావాళ్ళు చెప్పుకుంటూవుంటే నేను గదిలోనో, గోతాలమెట్లుచాటునో, నిద్రపోయేదానివలెనోవుండి వింటూవుండే దాన్ని. పెళ్ళికొడుకుసంగతి ఎంతవిన్నా ఇంకా వినవలెననే వుండేది.

మాఅమ్మమ్మ నన్ను పెంచుతూ మాయింట్లోనే వుండేది. ఆమె పెళ్ళికొడుకును గురించి మానాన్నతో మాట్లాడుతూ, "అయితే, సింగుపు స్వామివారి రథోత్సవమునాడు గుర్రం మెక్కివచ్చిన వాడేనా అల్లుడు?" అని అన్నది. ఆ తిరునాళ్ళలో ఆయన్ను చూచాను, గాని ఆయన పెళ్ళికొడుకవుతాడని నాకేమి తెలుసును? తెలిస్తే బాగా చూచేదాన్ని అనుకొన్నాను. అయినా అప్పుడు చూసిన జ్ఞాపకము కొంచెముగా వున్నది ఆయన ముక్కు, నోరు, కళ్ళు, చెవులు, ముందరిజుట్టూ జ్ఞాపకము తెచ్చుకోడానికి చాలా ప్రయత్నము చేశాను.

పెళ్ళిలగ్నము ఆరోజు కారోజుకు దగ్గిరిగి వస్తున్నకొద్దీ మాయింట్లో పెళ్ళిపనుల అడావిడి హెచ్చింది. మాపశువుల కొట్టాలన్నీ బాగుచేశారు. దొడ్డినిండా పెద్దపందిరి వేశారు, అప్పడాలు, వడియాలు, పచ్చళ్ళు, ఊరగాయలూ తయారయినవి పప్పులు, బియ్యాలూ, రకరకాలుగా తయారుచేయించి వంటయింట్లో బిడాయి వేశారు. పెళ్ళిరోజుల్లో వర్షము వస్తుందేమో అని గాడిపొయ్యి సావడిలో తవ్వినారు. ఇంకా పెళ్ళి అయిదారు రోజు లున్నదనగానే వంట అక్కడే చెయ్యడము ప్రారంభించారు. వివాహము రెండు మూడు-రోజుల్లోకి వచ్చేటప్పటికి మాచుట్టా లంతా బళ్ళెక్కి వచ్చారు. గంటల

చప్పుడయినప్పుడల్లా వాకిట్లోకి వెళ్ళి చూచేదాన్ని. వచ్చిన చుట్టాలతో మా పెద్దమండువా యిల్లంతా నిండిపోయింది. పెళ్ళికి కొత్తబట్టలు, పోకచూర, లవంగాలు ఇంకా ఏవేవో సామగ్రిలు మాతాత గుంటూరునుంచి తెప్పించినాడు. మానాన్నగది ఆమూటలతో నిండిపోయింది. కొట్టుపెత్తనము మా సవతితల్లిగారి అన్నది.

రేపులగ్న మనగా మావాళ్ళు నన్ను పెళ్ళికూతురిని చేశారు, మరి ఇద్దరిని తోడు పెళ్ళికూతుళ్ళను చేశారు. నా నొసట కళ్యాణపు బొట్టు, బుగ్గను చుక్క, కాళ్ళకు పారాణి పెట్టినారు. మావూరి మేళగాళ్ళు వాయించినారు. మాచుట్టాలు చీరెలు, రూపాయలు, ఉంగరాలూ చదివించారు.

పెళ్ళికూతురిని చేసిననాటి సాయంకాలము మా మేనత్త, అమ్మమ్మ, మరోముసలమ్మా అరిసెలు వండుతూ వున్నారు, అక్కడికి వెళ్ళి నేను పీటమీద కూర్చుని, వాళ్ళతో కబుర్లు చెప్పుతూ అరిసెముక్కలు తింటున్నాను. మామేనత్తకొడుకువచ్చి నాసరసను నిలవబడ్డాడు. "అత్తా, రాముడికికూడా ఒక అరిసె ఇయ్యి, తింటూవుంటాడు," అని నేనొకపీట చూపించాను. మాఅత్త అరిసెయిస్తూ, "మా రాముడింకా రెండేళ్ళు పెద్దవాడైతే మాసుందరికి మొగుడయ్యేవాడే!" అన్నది. మామేనత్త కొడుకు నాకంటె ఏడ్సర్థము పెద్ద, నాయెత్తు వుంటాడో వుండడో, నేనెప్పుడూ వరసలాడుతూ వుండేదాన్ని. రాముడు నాసరసపీట మీద కూర్చుని అరిసె తింటూవుంటే నాచేతి కంటిననెయ్యి అతని బుగ్గలకు పూసి, "రాముడూ, నీవునాకు మొగుడవయ్యేవాడవు కా[illegible]లు!" అన్నాను. "చూడవే అమ్మా, నెయ్యి రాస్తుంది! దీనికి బొత్తుగా భయము లేదు. పెళ్ళి కొడుకుతో చెప్పుతానుండు!" అన్నాడు. మాఅమ్మమ్మ మాఅత్తమాటకు, "బ్రహ్మలిఖితము గదా!" అన్నది. కొంతసేపు ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. నేను అరిసెవంటు చూస్తూవున్నాను. ఇంతలో వాకిట్లో ఎద్దులగంటల చప్పుడయింది. "వెంకమ్మప్ప వచ్చిందేమో చూడు," అని మాఅమ్మమ్మఅన్నది. "రాముడూ, తిన్నది చాలుగాని, వాకిట్లోకివెళ్ళి చూతాము, రా," అని చెయ్యి పట్టుకొని అతనిన్ని లాక్కుపోయి వీధి గుమ్మము దగ్గిర నిలుచున్నాను. మా వెంకమ్మప్ప పిల్లలూ బండి దిగినారు. బండి దిగుతూనే మాఅప్ప, "ఏంరాముడూ, పెళ్ళికూతురికి తోడుజవానువా యేమిరా?" అన్నది. "సుందరిని పెళ్ళికొడుకుకు అప్పజెప్పేదాకా నేనే కావలి ఎవరూ ఎత్తుకు పోకుండా!" అన్నాడు.

"మంచి బంటోతు అక్కయ్యా!" అన్నాను.

నేను నిద్దర లేచేటప్పటికి ఒకటేఅడావడిగా వున్నది. వారినీ వీరినీ బిగ్గరగా

పిలవడముతో అప్పటికే చాలామంది గొంతులు బొంగురుపోయినవి. 'పొయ్యి మండి పోతున్నది, చద్దివణ్ణాలకు బియ్యము కొలిపించండి, బాబూ!' అని వంటబ్రాహ్మడు అంటున్నాడు. మామామ మానాన్నతో, 'పొద్దెక్కుతున్నది. భజంత్రీలను రమ్మని, వూళ్ళో మనవాళ్ళను నలుగురినీ పిలిచి రా. పెళ్ళివారు వూళ్ళోకి వస్తే వారికోసం వెళ్ళడానికి తర్వాత తీరదు — బుచ్చమ్మ వూళ్ళో పేరంటం పిలవడానికి తొందరగా బయలుదేరు!" అని మా సవతి తల్లితో కూడా అన్నాడు. కొంచెం సేపటికి మానాన్నా, అమ్మా, ఇంకా కొంతమందీ మేళముతో కలిసి భోజనాలకు పిలవడానికి ఊళ్ళోకి వెళ్ళినారు.

లగ్నపత్రిక పురోహితుడి చేతికిచ్చి ఆకిందటి సాయంకాలమే పెళ్ళివారి వూరికి పంపినారు. పెళ్ళివారు రావలిసిన వేళ సమీపిస్తున్నది. మామ చాకలివాడి నొకడిని పిలిచి, 'వరే, పెళ్ళివారెంతదూరము వచ్చారో చూసిరారా,' అని పంపినాడు.

నేను దొడ్లో అరుగుమీద కూర్చుని మొఖము కడుక్కొంటున్నాను. వీధిసావట్లో మామామ ఎవరితోనో పెద్దపెట్టున కేకలు వేస్తున్నాడు. పనులు చేస్తూవున్న వాళ్ళంతా ఎక్కడిపనులు అక్కడ విడిచిపెట్టి అంతా సావట్లోకి పరుగెత్తారు. వంట చేస్తున్న బ్రాహ్మడు నన్ను చూసి, 'అమ్మా, కుక్కలు కాకులూ రాకుండా చూడ' మని చెప్పి, చెయ్యి కడుక్కొని, సావట్లోకి వెళ్ళినాడు. నేను మొఖము తుడుచుకుంటూ వుండగా వంటాయన తిరిగి గాడిపొయి దగ్గరికి వెళ్ళి, గంటె తిప్పుతూ, 'ఎంత పని జరిగింది! ఎంతసాహసము!' అన్నాడు. ఏదో దొంగతనము జరిగింది అని నేననుకొని, 'ఏమిటండి?' అని అడిగాను.

'లగ్నపత్రిక తీసుకువెళ్ళిన బ్రాహ్మడు వచ్చాడు. పెళ్ళివారు లగ్గానికి రామన్నారట!'

'ఏమైనా ఆటకం వచ్చిందా?'

'ఆటకం లేదు, వాళ్ళబొందా లేదు! మీపుల్లయ్య మామగారితమ్ముడు సీమకు వెళ్ళి వచ్చిన వారితో కలిసి భోంచేశాడట. అందుచేత మీమామకు, ఆయననుబట్టి మీకూ వెలిట. స్నాతకము చేసుకుని లగ్గానికి బయలుదేరడానికి సిద్ధముగా వున్న వాళ్ళకి ఎవరో ఈసంగతి చెప్పారట. అందుమీద ఈసంబంధము మాకక్కర లేదన్నారట. పెళ్ళివారు. పీటలమీది పెళ్ళిళ్ళు పాడుచేసే ముండాకొడుకుల మాటలు పట్టుకొని ఈ వెర్రి ముండావాళ్ళు సంబంధం మానుకోవడ మేమిటి?—పాపము, బ్రాహ్మడు ఎంతప్రయత్నము చేసుకొన్నాడు! ఇంటినిండా చుట్టాలు దిగినారు. ఊళ్ళో భోజనాలకు చెప్పివచ్చారు. వంట లవుతూ వున్నవి. నట్టేట్లో పుట్టి మునిగినట్టయింది!'

నాకేమీ తోచిందికాదు. పెళ్ళి ఇలా ఆగిపోతుం దని ఎవ రనుకొన్నారు! సంగతి ఏమిటో చూతామని సావట్లోకి వెళ్ళాను. సావడినిండా జనము మూగివున్నారు. మామామ ఇంకా కేకలు వేస్తూ ఇటూఅటూ తిరుగుతున్నాడు.

ఆయనవంటినిండా చెమటపట్టింది. కొంచెము బొరికలవాడు కావడముచేత మామామ రోజుతున్నాడు. ఎక్కడివాళ్ళక్కడ నిశ్చేష్టులై నిలబడ్డారు. మా నాన్న ఖిన్నుడై స్తంభమును ఆనుకొని, గడ్డము చేతితో పట్టుకొని, ఆలోచిస్తూ నిలుచున్నాడు.

'సూరయ్యా, నీవలా ఆలోచిస్తే కార్యము కాదు. ఆఖరిగిముండా కొడుకులు రామన్నారని కార్యము మానుకొంటామా యేమిటి! వాళ్ళ మొఖముమీద కొట్టినట్టు ఈలగ్నము వేళకే వివాహము చేయించకపోతే నియోగపువాణ్ణికాను!' అన్నాడు మామామ.

ఆమాటలు విని, మామామకు మతిపోయిందనుకొన్నాను. పెళ్ళికొడుకులేకుండా పెళ్ళి, ఎలాజరుపుదామని ఆయనవుద్దేశమో అని నేను ఆశ్చర్యపడుతూ వున్నాను.

'సూరయ్యా, చేసినపని వ్యర్థమవుతుంది. నలుగురిలోనూ నామోషీ! ఇప్పుడు పిల్లకు పెళ్ళి జరగకపోతే, పిల్లకేదో వంకని నలుగురి నోళ్ళలో పడుతుంది. ఆనక పస్తాయించిన లాభము లేదు! నామాట విను. రాముడికీ సుందరికీ పద్నర్థము వారం వున్నదిగదా. వాడికి తలంటి నీళ్ళుపోసి, స్నాతకము కానివ్వండి. పదమూడు ఘడియలపై చిలుకు దివ్యమైన లగ్నముంది. ఆలగ్నానికి ముడిపెట్టేదాము!' అన్నాడు మామామ.

మానాన్న ముఖముకేసి చూస్తూవున్నాను. ఆయన ముఖానికి తెలివి వచ్చింది. 'సరే, జరుపుదాము,' అన్నాడు. నేను ఇటూ అటూ చూచేటప్పటికి నా పక్కనే గోడ కానుకొని మాబావ నిలుచున్నాడు. ఆయనను చూచేటప్పటికి నాకెక్కడలేనిసిగ్గూవచ్చింది. తొందరగా దొడ్లోకి వెళ్ళుదామని బయలుదేరేటప్పటికి మాబావ నాకొంగుపట్టుకొని, 'ఎక్కడినించి వచ్చిందే సిగ్గు?' అన్నాడు. ఇంతలో మామామ ఆయనను చూసి, 'పురుషోత్తం, మరదలితో తర్వాత సరసాలాడవచ్చుగాని ముందిటురా!' అన్నాడు. ఒక్కపరుగున నేను గదిలోకి వెళ్ళిపడ్డా!

3

నేను మంచముమీద పడుకొని గోడమీద సావిత్రీ సత్యవంతుల బొమ్మ చూస్తూ వున్నాను. కొంచెము సేపటిలో నాకు కునుకు పట్టింది.

మెలుకువ వచ్చి నేను కళ్ళు తెరిచేటప్పటికి మాసవతితల్లి నన్ను చేతితో తట్టుతూ, 'సుందరీ, ఇక్కడున్నావటే! లేచి రా, తలంటి నీళ్ళుపోస్తాను. గౌరి పూజ చేతువుగాని,' అన్నది.

కొంతసేపటికి మామామ నన్నో తట్టలో కూచోబెట్టి, సావట్లోకి ఎత్తుకొని వెళ్ళాడు. సావడినిండా జనము కూర్చున్నారు. ఆడవాళ్ళంతా ఒకచోట నిలబడి వున్నారు. ఇద్దరు బ్రాహ్మలు మంత్రాలు చెప్పుతూ కొత్తబట్ట అడ్డముగా పట్టుకొని నిలుచున్నారు. నాకా పొద్దున జరిగినదేమీ జ్ఞాపకము లేదు.

అయితే పెళ్ళికొడుకు ఏలావుంటాడో చూతామనుకొన్నాను. మాయిద్దరికీ మధ్య అడ్డముగా వున్నబట్టలోనుంచి పెళ్ళికొడుకు రూపరేఖలు కనబడతవేమో అని ప్రయత్నముచేసి చూచాను. కొంతసేపటికి లీలగా ఆకారము కనబడ్డది. మరికొంతసేపటికి అడ్డముగా పట్టినబట్ట చప్పున తీసివేశారు పెళ్ళికొడుకును చూచేటప్పటికి మామేనత్తకొడుకే! నాకు చాలా ఆశ్చర్యము వేసింది నే నింకా నిద్రపోతూ వున్నానేమో అనుకున్నాను. ఇలా అనుకొని ఒకమాటు కళ్ళుతుడుచుకునే టప్పటికి పెళ్ళికుమారుడు లేచి నాకంఠాన మంగళసూత్రము కట్టినాడు. నాకు నిద్రపట్టక ముందు జరిగిన సంగతులన్నీ జ్ఞప్తికివచ్చినవి.

ఆరాత్రి స్థాలీపాకము చేయించారు. తలవంచుకొని కూర్చున్నంతసేపూ పెళ్ళికొడుకును నఖశిఖపర్యంతము చూస్తూనే వున్నాను. అదివరకున్నట్టు లేరువారు; పెళ్ళికొడుకయిన దగ్గిరనుంచీ ఏమో వింతగా కనబడ్డారు.

మరునాడు మేజువాణి. మేమిద్దరము పూలబంతులాడినాము. ముత్తైదలు పాటలు పాడినారు. భోగము మేళముకూడావున్నది. నామనస్సు వీటిమీద లేనేలేదు. పెళ్ళికొడుకే నాహృదయమంతా ఆక్రమించుకొన్నారు.

ఆరాత్రి ఆపోసనము అయినతర్వాత నేనువెళ్ళి దొడ్డి అరుగుమీద కూర్చున్నాను. అక్కడయెవ్వరూ లేరు. ఇంతలోకే ఎవరో నాదగ్గిరికి వస్తున్నట్టు తోచింది. తిరిగి చూసేటప్పటికి పెళ్ళికొడుకు నాదగ్గిరిగావచ్చి నిలుచున్నారు! నేను లేవబోయినాను.

'ఏం, పెళ్ళికొడుకును అయినానా లేదా!' అని నవ్వుతూ అన్నారు. సిగ్గుపడి పరుగెత్తినాను.

౪

తర్వాత చాలా కాలమునకు కాపరానికి వెళ్ళినాను. మాఅత్తగారు ఒకనాడు అరిసెలు వండుతూవున్నది. నేనామెదగ్గిరగా కూర్చుని తింటున్నాను. ఇంతలోకే మావారు సావట్లోనుంచి చప్పునవచ్చి నన్నుచూసి, 'నాకుకూడా అరిసెముక్కలు పెట్టించవూ?' అన్నారు.

నేను కూర్చున్న చోటునుంచి వెంటనే లేచాను. చేతిలో అరిసెముక్క కిందపడ్డది. నేనక్కడ నిలవక సావట్లోకి వెళ్ళినాను, వారు నావెంటనే సావట్లోకివచ్చి, 'బుగ్గలకు నెయ్యిరాస్తావా యేమి?' అన్నారు.

పెళ్ళినాటి సంగతి జ్ఞాపకమువచ్చి నాకు నాకు చాలా సిగ్గువేసింది. అరిసెలు వండవలసివచ్చినా, తినవలసివచ్చినా ఇప్పటికీ నాకు అపరిమితమైన సిగ్గు! ఇంతలో వారు నాదగ్గిరకువచ్చి, ఏమేమో నెమ్మదిగా నాచెవిలో అన్నారు. ఆమాట లేవీ నాబుర్రకెక్కలేదు. ఈ స్థితిలో మావారి బుగ్గలకు అప్రయత్నముగా నాచేతిజిడ్డు అంటింది!

# ఆత్మసమర్పణము

పెద్దిభట్ల పూర్ణశర్మ

ప్రణయబంధాన నీయంఘ్రిపద్మములకు
నాహృదయంబు బంధించినాను నాథ!
నాసమస్తము నీదర్శనార్థ మొసఁగి
వేణుగాన విశారదా, వేడుచుంటి

మున్ను కలరెందఱో నాకు ముఖ్యులనుచు
దలఁచి యుంటినిగాని యీతరుణమందు
నెవ్వరికిఁ గాకపోతి నీవే గ్రహింపు!
వేణుగాన విశారదా, వేడుచుంటి.

గోకుల వసించు నాబంధుకోటియెల్ల
దూరురాలినిగాఁ జేసినారు నన్ను!
హృదయవేదన నార్పుకో నెంచి నాథ,
వచ్చితిని జేర నీపాద వనజ యుగము!

నాకు సర్వమ్ము నీ వని నమ్మియుంటి
అంతటను నీదు సౌందర్య మరయుచుంటి
న్యాయమగు నేది తోఁచిన నదియొనర్పు
మకట! పొమ్మనియానతీయకుము నాథ!

వేణుగాన విశారదా, వేడుచుంటి
నాసమస్తము నీదర్శనార్థ మొసఁగి
ఒక్కనిముసము నిన్నుఁ జూడకున్న నాథ,
ప్రాణములుస్థానములనుండి పట్టువదలు!

# చేసుకొన్నవారికి చేసుకొన్నంత

నోరి నరసింహం

౧

"నేను త్వరగా వెళ్ళవలె ననుకుంటున్నట్టుగానే దోవలో అన్నీ ఆలస్యాలే జరుగుతున్నవి. ఎద్దునదిలించిపోనీ!" అని బండీవాణ్ణి తొందరపెడుతూ ఒంటెద్దు బండీఎక్కి విశ్వనాథము రోడ్డున పోతుండెను. బండీవాడు ఎద్దును త్వరగానే తోలుతున్నాడు. ఇంతలోనే ఒక పెద్దమనిషి విశ్వనాథంగారితో అత్యవసరమైన సంగతిమాట్లాడవలెనని బండీఆపించాడు.

ఆ వెనకటిరోజే విశ్వనాథము పని మీద బెజవాడ వచ్చాడు. పని ఇంకా పూర్తి కాలేదు. కాని ఇంటివద్దనుంచి భార్యను పాముకరిచిందనీ అవసరంగా రావలసిందనీ టెలిగ్రాం రావడముచేత ఆయన ఈరోజే తన సామాను సద్దుకొని ఇంటికి ప్రయాణమైనాడు. బండీ దొరకక కొంతసేపూ రోడ్డుబాగుచేస్తుంటే మరికొంతసేపూ ఆలస్యం కావ

డంబెట్టి రైలు అందుతుందో అందదో అని భయంగావున్నది. భార్యకేట్లావున్నదో అనే ఆదుర్దావల్ల మరీ ఏమీతోచకుండావున్నది. ఆవచ్చిన పెద్దమనిషితో ఏవో నాలుగుముక్కలు మాట్లాడి పంపించి బండీవాణ్ణి తొందరపెట్టినాడు. అతని దేహము బండీలోవుందే కాని ఆత్మ రైలులో వెళ్లి పడవలెనని లేచి లేచిపోతున్నది.

చివరకు బండీ రైలుస్టేషనుకు వచ్చింది. రైలు బయలుదేరడానికి ఇంకా పదినిముషాలే వ్యవధానమున్నదని తెలిసింది. మొదటిగంట వినబడ్డది. విశ్వనాథం త్వరగా ట్రంకుదింపి బండివాడి చేతులో ఒక రూపాయి పెట్టినాడు. వాడు నాదగ్గిర చిల్లలేదని రూపాయి తిరిగీ ఇచ్చి డబ్బుకు తొందరపెట్టాడు. అక్కడ ఎవరినడిగినా చిల్లర లేదన్నారు. కాలము పరుగెత్తుతున్నది.

“అయితే టిక్కెట్టు తీసుకొని నీబాడుగ నీకిస్తాను. వెంబడి రా రాస్తే”, అన్నాడు విశ్వనాథం.

“నేనీ వంతెన ఎక్కివచ్చేందుకువీలు కాదండీ. అందాకా ఎద్దులువదు. ఇతర బాడుగలు మించిపోతవి” అని బండివాడు ఇబ్బంది పెట్టాడు.

అప్పుడాయన పళ్ళను కాణంవాడికి కొంతపట్టంఇచ్చి చిల్లర తెచ్చి బండీవాడికిచ్చి పంపాడు.

ట్రంకు చాలా బరువుగా వుంది విశ్వనాథం బలహీనుడు, వంతెనదాటి పెట్టె మోసుకు పోలేడు. తేనెతుట్టె మీద ఈగలవలె పోర్టర్లు పెట్టెచుట్టూ మూగినారు కాని అందులో ఒక్కడూ అర్ధరూపాయికి తక్కువకు తేనన్నాడు. జరూరని వాళ్ళకు తెలుసు. ఎన్నడూ లేనిది ఇంతకూలి ఇవ్వడ మిష్టములేక విశ్వనాథం కొంత అనుమానించాడు. ‘పావలా, ఆరణాలు, ఏడణాలు’—‘రా’ మన్నారు అర్ధరూపాయికి దమ్మిడీతక్కువైతే రామన్నారు. సరేలే, ఒప్పుకొని ఒకణ్ణి తెమ్మన్నాడు. నాకు తెమ్మంటే నాకు తెమ్మని ఒత్తిడి ఇటులాగి అటులాగి వాళ్ళు కొంత ఆలస్యముచేశారు.

టిక్కెట్లు ఇచ్చేచోట ఎవ్వరూ లేరు. టిక్కెట్టుకు ఆలస్యం కాదుగదా అని విశ్వనాథం సంతోషించి అడావుడిగా “గుంటూరికి ఒక టిక్కెట్టు!” అని అడిగినాడు. టిక్కెట్లిచ్చేవాడు, “రెండోగంట కొట్టబోతున్నారు. ఇప్పుడు టిక్కెట్లిచ్చేందుకు వీలులేదు,”దన్నాడు. ఎలాగో బతిమాలి భంగపడి టిక్కెట్టు తీసుకునేప్పటికి బ్రహ్మప్రళయమైనది. కూలివాడిని పరుగెత్తమని సంజ్ఞచేస్తూ తాను రైలువద్దకు పరుగెత్తినాడు. “రెండోగంటకొట్టినారు ఇక అందదండీ!” అని కూలివాడు అన్నాడు.

విశ్వనాథం ఏలాగో రైలులో పోయిపడ్డాడు. పోర్టరు పెట్టె రైలులో పడవేసి డబ్బుతీసుకునే సరికి రైలు కదిలింది. ‘రైలందిందనే తృప్తితో అమ్మయ్యా!’ అని ఒక నిట్టూర్పు విడిచాడు. ఆయన కూర్చోవడములో పక్కనే పెట్టివున్న ఒక తలగుడ్డ కింద పడ్డది. కాని ఆ ఆతృతములో అతనది చూడలేదు.

రైలుకందుకోవలెననే తపనవల్ల విశ్వనాథం ఒళ్ళంతా దిగచెమటలు కా

రింది. ఇంకా ఆయాసంతో రొజుతూ ఉన్నాడు. నిట్టూర్పులు విడుస్తు ఒకటే విధముగా తన ఉత్తరీయము చెంగుతో విసురుకుంటాడు. మనస్సుకు కాస్త శాంతిరాగానే భార్యసంగతి జ్ఞాపకంవచ్చి ఆదుర్దా ఎక్కువౌతుంది. మధ్యమధ్య "కనకదుర్గతల్లి చల్లగా చూస్తే చాలు భయమేమి?" అని ధైర్యం తెచ్చుకుంటాడు. అత నిట్లా ఉండగా పక్క నున్న మనిషి, 'ఇక్కడ ఒక సిపాయి కూర్చుని పోయినాడు. వాడు మళ్ళీ వస్తున్నాడు. మీరు లేవవలసి వస్తుంది" అన్నాడు, కాని ఆమాటలు పరధ్యానంగా ఉన్న విశ్వనాధానికి వినపడలేదు.

సిపాయి వచ్చేరావడంతోనే గుడ్లెర్రజేసి, "నాతలగుడ్డ కిందపారేసి నాచోట్లో కూర్చున్నావ్?" అని విశ్వనాధాన్ని చెంపన ఛెళ్ళునగొట్టి ఆచోటినుంచి లాగివేశాడు పాపము విశ్వనాథం గజం దూరానబోయి పడ్డాడు. విశ్వనాధం 'అబ్బా' అని చెంప తడుముకొని చూచేటప్పటికి యమభటునివంటి సిపాయివాడొకడు తాను మొదట కూర్చున్న స్థలములో కూర్చునిఉన్నాడు. విశ్వనాధము ఏమిచేయగలడు మెల్లిగా లేచి ఒళ్ళుదులుపుకొని ఇంకోచోటబోయి కూర్చున్నాడు.

విశ్వనాధాన్ని 'పాప' మన్నవాళ్ళే గాని భయంచేత సిపాయినెవ్వరూ ఏమీఅనలేకపోయినారు. కొంతసేపు జాలిపడి అప్పటికి కొద్దిరోజులకిందటనే పుట్టిన మహాయుద్ధమును గురించిన మాటలలో దిగినారు. ఇటువంటియుద్ధము ప్రపంచకము పుట్టినతర్వాత ఎప్పుడూ జరగలేదు. శత్రువులజయాలే ప్రతి పత్రికలోనూ కనబడుతున్నవి. అతిఘోరముగా ఉన్నదని అందరూ అనుకున్నారు.

తనకు అన్యాయంగా జరిగినపరాభవానికి విచారిస్తూ చేసేదిలేక భార్యాకోసం ఆదుర్దాపడుతూ వచ్చేదుఃఖాన్ని లోపలలోపలనే అణుచుకుంటూ ఆమాటలలో జోక్యం కలుగజేసుకోక కనకదుర్గమీద భారంవేసి నెమ్మదిగా కూర్చున్నాడు విశ్వనాధం.

సిపాయివాడు మొదట మూతి ముడుచుకొని భీష్మించుకు కూర్చుని తర్వాత కొంతసేపటికి యుద్ధాలపాటలూ లల్లాయిపదాలూ ఎక్కడలేని ఉత్సాహంతో పాడుతూ ఎగిరెగిరి కిటికీతలుపులు బద్దలయ్యేట్లు మద్దెలవేస్తూ ప్రయాణం చేశాడు.

కొన్నివళ్ళు గడిచినవి.! ప్రపంచకంలో ఎన్నోమార్పులు జరిగినవి. కాలం ఇటువి అటూ అటువి ఇటూ చేసింది. మునుపు జరుగుతున్న మహాసంగ్రామము మాగిపోయింది. మొదట బలముతో గర్వించి పొంగినశత్రువుల అదరిపాటు అణిగింది. ఎన్నోనష్టాలు భరించి సంధికి ఒప్పుకున్నారు.

బెజవాడలోకూడా చాలా మార్పులు జరిగినవి కొత్తస్టేషను కట్టారు. రైళ్ళదీ కూలీలదీ ప్రయాణికులదీ అడ్డావుడీ కొత్తస్టేషన్లో ఎక్కువవుతుంది.

ప్రజలు ఇంత శ్రీప్రస్తేమమ్మా వంతెనా ఎక్కడా లేదనుకుంటున్నారు.

మళ్లీ విశ్వనాథం బెజవాడ వచ్చాడు. విశ్వనాథంలోకూడా చాలా మార్పులు జరిగినవి. అతనిప్పుడు వ్యవహారపు పనిమీదరాలేదు. భార్యకు పాపుకాటు నయమయ్యేందుకు మొక్కుకున్న మొక్కు తీర్చుకోవడానికి కుటుంబముతో కలిసి ఎంతో ఉత్సాహంతో వచ్చాడు. అతనిమాటు దేనికీ అడ్డుపడి పడడంలేదు నెమ్మదిగా ఆవింతా ఈవింతా భార్యకు చూపిస్తూ తాను చూస్తూ పోతున్నాడు.

ఆప్పుడు నవరాత్రాలు అవడంచేత బెజవాడ అంతా చాలా సందడిగా ఉన్నది. ఎక్కడచూచినా భజనలూ కాలాక్షేపాలే' ఎక్కడచూచినా శక్తిపూజలే. "పూళ్ళోధనవంతులు బీదవాళ్లకు లెక్కలేకుండా అన్నసత్రాలు వేయిస్తున్నారు. చుట్టుపక్కల పల్లెలనుంచీ పట్టణాలనుంచీ కనకదుర్గను దర్శించి కానుకలు అర్పించడానికి వేలకువేలు ప్రజలు వచ్చారు.

విజయదశమినాడు భార్యతోకూడా పొద్దున్నే లేచి కృష్ణలో స్నానంచేసి విశ్వనాథం కనకదుర్గను దర్శించడానికి వెళ్ళుతూఉన్నాడు. దోవలోకూర్చున్న బిచ్చగాళ్లకు ప్రతివాడికీ గుప్పెడు బియ్యము వేసుకుంటూ భార్య వెళ్ళుతున్నది. మరీ కుంటివాళ్లకూ గుడ్డివాళ్లకూ కానీ అర్ధణా ఇస్తూ విశ్వనాథం పోతూఉన్నాడు. కొద్దిసేపటి కిందటనే ఉదయించిన సూర్యుని కిరణాలు చుట్టుపక్కల కొండలను శోభావంతములు చేస్తూఉన్నవి కృష్ణాభవాని అలలమీద ఊగులాడి వచ్చిన చల్లగాలి హాయిగా కొట్టుతున్నది.

విశ్వనాథము భార్య ఒక బిచ్చగాని ముందు గుప్పెడు బియ్యము వేసింది. ఆ బిచ్చగాడికి కుడిముంజెయ్యిలేదు. పుట్టుదరిద్రునికంటేకూడా వాడు కనాకష్టంగా ఉన్నాడు. ఒళ్ళంతా దుమ్ముకొట్టుకొని ఉన్నది. చర్మము చీడపట్టిమూ చేదుకే అసహ్యముగా ఉన్నది. ఒంట్లో కండఅన్నమాటేలేదు. బొమికెల పోగుగా వున్నాడు. మనిషిమాత్రము ఆజానుబాహువుకాబట్టి వానిస్థితి చాలా జాలికలిగిస్తూఉన్నది. వాడు 'అయ్యా' అని విశ్వనాథమునకు తన ఒంటిచేయి చాచినాడు. వానిచేతిల్లో అతను ఒక కాసు వేయబోతున్నాడు. ఇంతవరకూ అడ్డుగాఉన్న ఇంటి చాటునుండి వచ్చి ఒక సూర్యకిరణ మాముష్టివాని ముఖానపడ్డది. దానితో వానిముఖము స్పష్టముగా విశ్వనాథానికి కనపడ్డది. ఆముఖము చూడగానే ఏదోతలపుకువచ్చి ఇవ్వబోయిన కానీ వెనక్కుతీసి అక్కడే నిలవబడ్డాడు.

తనకు ఇవ్వబోయినకానీ అకస్మాత్తుగా ఇవ్వకపోవడానికి కారణము తెలుసుకోలేక చాచినచెయ్యి తీయక ఎంతోదీనముగా చూస్తూ మళ్ళీ 'అయ్యా' అన్నాడు ముష్టివాడు.

విశ్వనాథం కొంతఆలోచించి, "నీవు కొన్నాళ్లు సిపాయీపనిచేయలేద ?" అని ముష్టివాణ్ణి అడిగినాడు.

ఆముష్టివాడు ఉలిక్కిపడి ఆశ్చర్యంతో, "అవునుస్వామీ, యుద్ధములో

నాకుడి చెయ్యి విరిగింది. తర్వాత నన్ను ఉద్యోగంలోనుంచి తొలిగించారు. ఇప్పుడీగతిపట్టింది!" అన్నాడు. అట్లా అంటూనే విశ్వనాథం ముఖము తేరి పారచూశాడు. వెంటనే మును పెప్పుడో రైలుబండిలో జరిగిన సమాచారము జ్ఞప్తికివచ్చి ఒళ్ళుజలదరించి చెయ్యి వెనక్కుతీశాడు ముష్టివాడు.

విశ్వనాథం ఎంతో శాంతముగా ఒకసారి ఆకాశంవంకచూచి, "నేనుజ్ఞాపకమున్నానా?" అంటూ ఒకరూపాయి తీసి ఆముష్టివానిబడిలో మెల్లగావేసి అటుతిరిగిచూడక భార్యతోకలిసి కనకదుర్గనుదర్శించి మొక్కు తీర్చడానికి వెళ్ళి పోయినాడు.

ఆ ముష్టివాడా రూపాయితీసుకుని దానితో నెత్తినకొట్టుకొని విశ్వనాథం వెళ్ళినవంకే భక్తితోచూశాడు. విశ్వనాథం వెనక్కుతిరగలేదు. అతడు చూపుమేరదాటేదాకాఅటేచూసి నమస్కరించి ఆముష్టివాడు ఏదో ఆందోళనచేత అక్కడ ఉండలేక తనజోలె తీసుకుని విశ్వనాథము వెళ్ళినదిక్కుకే నడిచాడు. వానికో కొత్త ఆందోళన కలిగింది. కాని తనచెయ్యి పోయినదుఃఖము వాడారోజుతో మరిచిపోయినాడు. వాడికి విశ్వనాథం మాత్రము కళ్ళకుకనబడక పోయినా ఈజన్మలో మరుపు రాలేదు.

# చైత్రలక్ష్మి

ములుగు చంద్రమౌళి

చారుకుసుమ పరిమళ భారజనిత
సుందగమునుం డగుచుఁ బవమానుఁడెల్ల
కడలఁజరియింపఁ; జివురాకుగములమెక్కి
కోయిలలుబక్షకాంత వెట్టఁగూకూయటంచు;
గున్నమామిడి తేనెను గ్రోలి మేను
మఱచి దిశలు చెవుడ్పడ నఱచు నట్టి
చిలుక కూనలు గగనంబుఁజేరి, యొకటి
కొకటి మేఁతలఁ దినిపింప; వికచకమల
సముదయమునుండి ఝుమ్మని షట్ప
దములు
బయలువడ; దుంట విల్గొనిపంచశరుఁడు
చైత్రయాత్రా గమన మహోత్సాహి
యగుచు
నెలమి రతిఁగూడి రా చిల్కనెక్కి రాఁగ
చైత్రలక్ష్మి! యెక్కడ తెవెందు జనెదవమ్మ?
కనుల పండువు గ దె రంగారు నీదు
చక్కదన; మావసంతుని జాడబోయి
కూర్మి గనుఁగొను వారి కెక్కువగ సంత
సంబుఁ గూర్పగదమ్మ! డెందంబు వొళ్ళ.
నొందుగద నీదురాకకో యిందువదన!

# ఆంధ్రసాహిత్యమీమాంస

శ్రీ ద్వ్యాక్, శతావధాని, కోపల్లె శివకామేశ్వరరావు

సాహిత్యవిచారణకు ముందు భాషను దెలిసికొనుట మంచిది. తెనుఁగు ప్రజలయందు వాడుకలోని కెప్పుడు వచ్చినది యను ప్రశ్నమునకు సరియైన సమాధానము నింతవఱకుఁ జెప్పుట కవకాశము లేకున్నది. కొందఱు వేదయుగమునుండియు నాంధ్రులు కలరని చెప్పుచున్నారు. అది నిజమైనచో నప్పు డాంధ్రశబ్దముచే వ్యవహరింపఁబడిన భాషకును ఇప్పు డాంధ్రము, తెనుఁగు తెలుఁగు అని వ్యవహారములో నున్న భాషకును సామ్య మేమైన కలదా యను చర్చయు నింతవఱకుఁ దలయెత్తలేదు. కావున నీభాషకుఁ బ్రాధమ్యము నిర్ణయముచేయుట కవకాశము లేదు. ఇంతవఱకుఁ బండితులైనవారు కనుగొనిన విషయములనుబట్టి ఎనిమిదవ శతాబ్దిని దెనుఁగునందు సాహిత్యము కలదని తేలుచున్నది. దీనినిబట్టి చూడఁగా నెనిమిదవశతాబ్దికిఁ బూర్వము కొన్నిశతాబ్దులవఱకుఁ దెనుఁగు భాషాస్వరూపమున నుండవలెను. సాహిత్యరూపమున నున్న తెనుఁగు గ్రంథములను భాషాస్వరూపముననున్న కొన్ని శిలాశాసనములను బరికించి యాంధ్రమునకును, నితరభాషావాఙ్మయములకును గొంత సంబంధము కలదని తేల్చిరి. అరవము, కర్నాటము, మళయాళము మొదలగు దాక్షిణాత్యుల భాషలతోను విజయులగు తురకల భాషతోను సంబంధము కొంతకొంత కలదియు దీనినిబట్టి యాంధ్రులు కూపకూర్మములవలె నెప్పుడు లేరనియుఁ దమ చుట్టుప్రక్కలనున్న యితరజాతులవారి దేశములతో సంబంధములను గలుగఁజేసికొనిరనియు నంగీకరింపవలననే పరిశీలనము మునుగాఁ జెప్పుడగు చేయువారనియుఁ జెప్పుట గర్వోక్తి కాదు. ఈభాషకుఁ గల సంబంధము లన్నియు నొక సంబంధము కాదు. ఈసంబంధములు కేవల భాషాచరిత్రకారులకుమాత్ర ముపయోగించునేమో కాని రసపుష్టముగా కావ్యమును సృష్టించు కవికిఁ ఆనందము ననుభవించు సహృదయునకుఁ నిష్ప్రయోజనములు. భాషాచరిత్రకారులకును కవిసహృదయులకును బరమావశ్యకమగు సంబంధ మాంధ్రభాషకు సంకొకదానికిని గలదు. అది సంస్కృతము.

ఆంధ్రవాఙ్మయము ఉత్పత్తియైనది మొదలు సంస్కృతభాషకును దెనుఁగునకును నిరుపమముగా నవినాభావమున్నట్లు ప్రత్యక్షముగాఁ గన్పడుచున్నది. నేఁడు సామాన్యజనులును నాడుకయందు లెక్కలేని సంస్కృతపదముల నుపయోగించుచున్నారు. ఈభాషలకు రెంటికిని నింతసాంగత్య మెట్లు కలిగినదో విచారించుట భాషామూలమునకై వెదకు పండితుల కవసరము. ఈసాంగత్యప్రాప్తవాఙ్మయానంద మనుభవించువారు సహృదయులు. ఈసాం

గత్యాగానందు మంచిచెడ్డలను విచారించి కావ్యనిర్మాణమునందు మంచిని ప్రయోగించుట కవికి విధి. సంస్కృతభాషకుఁ బ్రాణము వంటిది వ్యాకరణము. అందు వైదికీస్వరప్రక్రియలు పూర్తిగాను సుప్తిజంతములును కృదంతములలోఁ గొన్నిటిని విడిచిన మిగుల సంస్కృతవ్యాకరణమహాసింధువు తెనుఁగున కత్యావశ్యకము. తద్భవ దేశ్యాదిపదములకుసంబంధించిన వ్యాకృతిని బైనఁ జెప్పలేదు. ప్రాచ్యుఁడు వేదాంతమునందుఁ బరిచయము లేనిది పండితుఁడు కానేరఁడు ఈ వేదాంతార్ణవ మీఁదుటకుముందు తర్కనదిని దాటుట నేర్చుకొనవలయును. కనుక న్యాయ్యమున విలయునంత పరిశ్రమముండవలయును. ఈన్యాయవేదాంతములు తెనుఁగున లేవనియే చెప్పవచ్చును. ఇవి వచ్చినపిదప సహృదయత కాని కవిత కాని యొకనియం దుత్పన్నమగుచో నప్పుడతఁడు సాహిత్యశాస్త్రమును జూడవలయునుగదా! కావ్యప్రపంచమునందుఁ బూర్వకవులు రసనిర్మాణమునకై చేసినయత్నములను సహృదయులు గ్రహించి వ్రాసినవి సాహిత్యశాస్త్రగ్రంథములు. ఒకపని యొకఁడు చేయఁబోవునపు డట్టిపనిని జేసి జయమందినవాని తెఱఁగులఁ జూచుట లోకరీతి. కనుక సాహిత్యశాస్త్రమును జూచుట యవసరము. ఇవియన్నియు ననగాఁ జాలవఱకు సంస్కృతవ్యాకరణము, న్యాయ్యము, వేదాంతము సాహిత్యశాస్త్రము తెనుఁగున నున్నచో మనభాషయందుఁ బండితుల మగుట కన్యభాషాసాహిత్యము మన కవసర ముండదు. నరసభూపాలీయము మొదలగు రెండుమూఁడు స్వల్పగ్రంథములు మాత్రము సాహిత్యశాస్త్రబోధకమై తెనుఁగున నున్నవి మహాసౌధమునంతకుఁ గాంతినిచ్చుట కొకకిరసనాయిలుబుడ్డి పెట్టుటయును, నాంధ్రసాహిత్యమును దెలుపుటకీగ్రంథములును సమానములు. కావుననే యాంధ్రమున సంస్కృతవ్యాకరణము న్యాయవేదాంతములతోఁపాటు సాహిత్యశాస్త్రమును లేదని చెప్పవచ్చును.

రెండువందల సంవత్సరముల నుండి మన పండితులచే సాహిత్య మొక శాస్త్రముగాఁ బరిగణింపఁబడక పోవుటచే నేన్యాయమో యేవ్యాకరణమో మాత్రము విద్యార్థు లభ్యసించుచు, సాహిత్యమును బూర్తిగా విడిచిపెట్టిరి. దానివలననే భాషకు నాశము సంభవించినదని చెప్పవచ్చును. న్యాయమునో వ్యాకరణమునో వేదాంతమునో యేదో యొక శాస్త్రమును జదువుటకంటె సాహిత్యశాస్త్రపారంగతుఁడగుట మిక్కిలి కష్టమని మొదట నెల్లరు దానిని భయముచే విడిచి పిదప నేఁటివఱకు గొందఱుపండితమ్మన్యులు సాహిత్యమును నిరసించుచున్నారు. సాహిత్యమనఁగాఁ గూడిన వ్యాకరణ, న్యాయ, మీమాంసా, కలాదుల, భావ మనిచెప్పవలయును. "సహితస్య వ్యాకరణ న్యాయమీమాంసాకలాదేర్భావః సాహిత్యమ్". కవికష్టమును జెప్పుచు నొకఁడు

"న స శబ్దో న తద్వాచ్యం
న స న్యాయో న సా కలా

"జాయతే యన్న కావ్యాంగ
మహో భారో మహాన్ కవేః"

అని చెప్పెను. దీని నంతను విచారించి చూడఁగా సాహిత్యశాస్త్రము లేని వాఙ్మయము వాఙ్మయము కానేరదు. ఇట్టి సాహిత్యశాస్త్రము మనభాషలో ను; కు లేకపోవుట గొప్పకొఱఁత.

ఈసాహిత్యశాస్త్రమునే యలంకారశాస్త్రమని ప్రస్తుతము మనపండితకోటి వ్యవహరించుచున్నారు. దీని కర్థమగు "అలంక్రియతే2నేన" యను కరణవ్యుత్పత్తిచే నుపమాదులను గ్రహించి "ప్రాధాన్యేన హి వ్యపదేశా భవన్తి" యను ప్రమాణవచనముచేఁ గరణవ్యుత్పన్నమైనదానికిని శాస్త్రనామ మిచ్చెదమనిన నుపమాద్యర్థాలంకారములకు సాహిత్యశాస్త్రమునందు ప్రాధాన్య మిచ్చినవార మగుదుము. కేవలాలంకారపూర్ణకావ్యము కావ్య మనిపించుకొనునా? ప్రాణమున్న నలంకారములు శోభ నిచ్చును గాని శవమున కలంకారములు శోభ నిచ్చునా? అందుకనియే యగ్నిపురాణమందు "వపుష్యలలితే స్త్రీణాం హారో భారాయతేపర" మ్మని యున్నది. కావున అలంకారములను ప్రధానములుగా గ్రహించి కరణవ్యుత్పత్తిచే నలంకారశాస్త్ర మనుటకంటె నలంకృతి యలంకారము, అదియు నలంకారశబ్దము భావసాధన మనియుఁ జెప్పి దాని నలంకారశాస్త్రమనుట యొకింత మెఱుఁగు.

కవి సాహిత్యశాస్త్రవేత్త యగును గాని సాహిత్యశాస్త్రవేత్త కవి కానేరఁడు. సాహిత్యశాస్త్రవేత్త సహృదయుఁడు: అనఁగా విమర్శకుఁడు. సహృదయునిజ్ఞానముమాత్రమే కవిని జేయలేదు. కవి కంతకంటె నెక్కుడువిశేష ముండవలయును. ఆవిశేష ముండుట వలననే కవి సహృదయులకు భేదము కలదు. కవి సృష్టికర్త. సహృదయుఁడు సృష్టి నానందించువాఁడు. తాను జేయఁబోవు సృష్టియందానందము ననుభవించిన పిదప నాయానందానుభవమునకు స్వరూపము నిచ్చువాఁడు కవి. కవి చూపెడు నానందము ననుభవించుట మాత్రమే సహృదయునిపని. కనుక నొకనికిఁ గవిత్వ మబ్బుట పురాకృతఫలమని చెప్పుదురు. ఒకనికిఁ గవిత్వ మబ్బవచ్చును గాని సాహిత్యజ్ఞానము లేకపోవచ్చు ననిన నాకవిత్వము యువతికిఁ గానిసుల్లెపూవువలె నుండును. ఈవిషయము యాథాతథ్య మగ్నిపురాణమునం దిట్లున్నది:

"నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర చ దుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర శక్తిస్తత్ర చ దుర్లభా"

ఇచ్చట శక్తి యనఁగా లోకశాస్త్రాదులఁ బరికించుటవలనఁ గలిగిననైపుణ్యమని యర్థము. శాస్త్రాదులవలన నుత్పన్నమగునైపుణ్యము సాహిత్యజ్ఞానము. కనుక శక్తి కేవలసాహిత్యజ్ఞానముకంటె నధికము, అట్లగుటచేఁ గవిశక్తి గలవాఁడును గవిత్వము నుజెప్పువాఁడును నగుటచే నీతఁడు శక్తిగలస్రష్ట. ఈరసజగత్తునందు గవియొక్కఁడే యనన్యసామాన్యతేజోవంతుఁడై ప్రకాశించువాఁడు. ఋష్యలనుబాసి మహర్షులు మహాకవులైరి. కవి కీప్రపంచమంతయు సామాన్యునకువలెఁ గనుపింపదు.

భావానుకూలముగా సర్వము కవికిఁ జూపట్టును. కాని వానికి దుఃఖభావము కూడ సుఖముగా గనుపించును. అందువలననే కవి యవ్యాహతమైన యానంద మనుభవించును. ఆ యానందమునకు పరిస్థితి లేదు కారణముచే నది బ్రహ్మానంద తుల్యము. ఇదియే కవిస హృదయులకుఁ గలపరస్పర భేదము. కవిచేయు సృష్టి కవితాస్వరూపమున నున్న కావ్యము. కావ్య మననేమి? ప్రస్తుతకాలమున నష్టాదశవర్ణనములతో నిండియున్న గ్రంథము కావ్యమని చాలమంది పండితంమన్యులయొక్కయు వారి భావాదర్శములగు పామరులయొక్కయు నభిప్రాయము. ఛందోబద్ధమైనవిషయము కావ్యమని జనుల యభిప్రాయము. ఈయభిప్రాయముగలవా రెంత తెలివిగలవారో యుండదకికిని దెలియును. కావ్యత్వమైనను అష్టాదశవర్ణనములు మహాకావ్యత్వసిద్ధికొఱకే ర్పడినవి. ఛందస్సు ధ్వనిమైత్రికొఱకు. న్యాయాదిశాస్త్రపారంగతులు కావ్యముల నెంత హీనముగాఁ జూచినను దప్పసరిగా మెచ్చుకొనుచున్నారు: కాని స్వల్పసంస్కృతపరిజ్ఞానము కలిగియే మురారి నాటకములోనివో యే నైషధములోనివో పాతికశ్లోకములను వ్యాఖ్యలతో వల్లించి పొట్టకూటికై చిరిగిన శాలువలను బైనగప్పికొని వచ్చుపండితులును జాలవఱకు హైస్కూళ్లలోనున్న పండితులును-శ్లిష్టపదసమన్వితములై భేతాళమంత్రములవలె పెటపెటలాడు సంస్కృతసమాస భూయిష్ఠములైన పద్యములను శబ్దాలంకార శ్లేషయమకాదులతో నిండిన పద్యములను శ్రేష్ఠతమకావ్యములనుగా జెప్పచుఁ బ్రజలను మోసపుచ్చుచున్నారు. వీరివలననే దేశమునందుఁ బ్రజాసామాన్యమునకును బాఠశాలలయందు విద్యార్థులకును నాంధ్రవాఙ్మయస్వరూపమును, నాంధ్రకవిత్వ రహస్యములును దెలియక స్వభాషయగు నాంధ్రమునందు, వాల్మీక్యాదిభారతర్షి పుంగవులతోడను హోమరు మొదలగు పాశ్చాత్యకవులతోడను బోల్పఁదగిన తిక్కయజ్వ పోతనామాత్యాదుల మధురవాక్కులను, గాళిదాసాదులతోను షేక్స్పియర్ మొదలగు కవులతో నుపమింపఁదగిన పెద్దనాదులసరసకావ్యములను మఱచి స్వభాషానిరసనము గలవారైరి. శాంతగంభీరస్వనములతో నిరంతరము నెల్ల తెలుఁగువారి హృదయాంతరాళములయందుఁ బ్రతిధ్వనింపవలసిన గ్రంథము లాంధ్రుల కెప్పుడు నామావశిష్టములగునవో అప్పుడే జాతిమత్వమును, దానితోపాటు ప్రతిభయు నశించినవని దేశచరిత్ర నెఱిఁగిన ప్రతివాఁడును జెప్పక తప్పదు. వాఙ్మయాభివృద్ధి దేశపురోవృద్ధికిఁ గారణము. ఏదేశజనులు స్వభాషయందు స్వవాఙ్మయమందు నిరసనముఁ జూపుదురో యాదేశ జనులు ప్రపంచముచే నిరసింపఁబడుదురు. ఏదేశజనులు పురోవృద్ధికి నాశింతురో వారు తమభాషావాఙ్మయముల యుచ్చదశను గోరుదురు. మనదేశము బాగుపడవలెనన్న మనవాఙ్మయము బాగుపడవలయును. వాఙ్మయము వృద్ధియగుట యనఁగా సాహిత్యము వృద్ధియ

గుట. సాహిత్యాభివృద్ధికి సహృదయత యావశ్యకము. సహృదయత కవిలేనిది కలుగదు. కనుక కవి యందు అసంస్కర్తలకంటె ముఖ్యుడు. కవి చెప్పునది కావ్యము. ఈకావ్యము స్వరూపము మొన్న కొన్నిటిచే అరుభేతా కవిగ్రహములైయున్నది. దాని నిజస్వరూపము సంస్కృతకవులకే కాక యాంధ్రకవులకును బొడకట్టినది. ఆ యానందస్వరూపమయ్యిన మగుటచేతనే తిక్కయజ్వ భారతమును నిర్మించెను. పోతన భాగవతమును బాడెను. పెద్దన మనుచరిత్రమును సృష్టించెను. ఈమువ్వురును మన వాఙ్మయ జగత్తునకు ప్రదీపవార్తలు. వీరుమువ్వురు రసరూపాత్మసాక్షాత్కారము నొందిన మహర్షులు. వీరిగ్రంథములను సాంతముగా జదివి యానందింపనివాడు తెలుగువాడు కాడు. వీరి కావ్యములను జూచిన గావ్యమన నేమియో తెలియగలదు. ఛందోనిబద్ధమైనంతనే కావ్యము కాదు. శబ్దార్థములు గలది కావ్యమా? నాకు ధనమున్నది నేను దరిద్రుడను మొదలగు వాక్యములు శబ్దార్థయుతములు కావా! వానిని కావ్యము లందుమా? కనుక శబ్దార్థములుమాత్రము మున్నదియు గావ్యము కానేరదు. అలంకారము లున్నది కావ్యమనిన్న కవముననె కలంకారముల శోభ తలపునకువచ్చును. అందుచే నదియు గాదు. కేవల దోషరహితమైనది కావ్యమా? వైద్యశాస్త్రము, తర్కము మొదలగునవి దోషరహితము లే; కనుక నవి కావ్యములన్న దోషరహితమైనది కావ్య మగును; కావున నదియు గాదు. గుణసహితము కావ్యమన్న దోషరహితత్వమే గుణసహితత్వము కావున నదియు గాదు. వీనియన్నిటి యొక్క సంఘీభావము కావ్యమనిన, "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య మితి కావ్యసామాన్యలక్షణ" మ్మని విద్యానాథుడు చెప్పినలక్షణ మగును. అతడును దానిని సామాన్యలక్షణ మనుచున్నాడు. తద్వ్యతిరిక్తమైన లక్షణ మింకొకటి యసామాన్యమైయునది యుండవలయునని యూకవిమాటలవలన దేలుచున్నది. నిరలంకారమగునది కావ్యము కాదా యనుశంకజేసి సర్వత్ర యలంకారయుతమై యొక్కచో స్ఫుటముగనలంకారము లేకపోయినను గావ్యత్వహాని లేదని మమ్మటాచార్యులవారు చెప్పినారు.

ఒకానొకచో నలంకారము లేకపోయినను గావ్యత్వహాని లేదనుటలో గావ్య మనేకపద్యయుత మని చెప్పినట్లయ్యెను. ఈయభిప్రాయము ప్రమాదము. సరసమగుపద్య మొక్కటియైనను గావ్యమగును. అందువలననే, ఏకఃశబ్దః సమ్యక్ జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుక్ భవతి యనున్యాయమును 'తదనిబద్ధం నిబద్ధంచ' అని కావ్యమునుగురించి వామనుడును 'Lyrics' Ballads అని పాశ్చాత్యులును వ్యవహరించుచున్నారు. ఒకపద్యమైన కావ్యమగును. 'నిరలంకృతీ పునఃక్వాపి'యను మమ్మటాచార్యులవారి కావ్యలక్షణవాక్యావ

యనమందు దోషమును జూపుచు వారును నిరలంకృతియగుదానినిగూడ కావ్యమని యొప్పికొనిరని తెల్పితిని. ఒకటి కావ్యమగునా కాదా యనువిచారణచేయువాఁడుసహృదయుఁడు.' ఈవిచారణ కేవలైహికముగా దేలునదికాదు అకావ్యమునందు సహృదయునకు సుఖానుభవము కలిగినఁగాని దానిని గావ్యమనఁడు ఈసుఖానుభవము సంతానము కలిగినదను వార్త విన్నప్పటిసుఖానుభవము, ధనమిచ్చినదను మాటవిన్నభవముసుఖానువంటిదికాదు. ఈగొప్పకారణముచేతనే ఈసుఖానుభవమును బ్రహ్మానందతుల్యమునిరి. అనఁగా బ్రహ్మానందాస్వాదనమును కావ్యసుఖాస్వాదనమును నొకటియే. ఏది యాస్వాదింపఁబడుచున్నదో యది రసము కదా? కనుకనే "బ్రహ్మైవరసః రసో వై సః" అను శ్రుతివాక్యము సార్థకమగుచున్నది. అప్పుడు రసము ప్రధానముగాఁ గలవాక్యము కావ్యమగును. ఈమాట చెప్పినతోడనే మమ్మటాచార్యులవారిని బరిహసించితిమనిగాని విశ్వనాథపండితకృతమగు సాహిత్యదర్పణమందలి కావ్యలక్షణమును స్వీకరించితిమనిగాని తలంపవద్దు. ఆ యిరువురుమహానుభావులును చెప్పినవానిలో గొంత సత్యము కలదు కాని రెండును లౌకికలక్షణములు. మమ్మటాచార్యులవారు చెప్పినదానిలో లౌక్యత్వవిచారణ పైనఁ జేసితిమి. ఇక సాహిత్యదర్పణకారుఁడు వ్రాసినలక్షణముకూడ లౌకికమే. అతఁడు రసప్రధానవాక్యము కావ్యమనుటలో రసశబ్దార్థమును శృంగారాదినవరసములకును, తదాభాసాదులకును నియమించినట్లుల "రస్యతే ఇతిరసః" ఇతి వ్యుత్పత్తియోగాద్భావతదాభాసాదయోఽపి గృహ్యన్తే" యనువాక్యము వలన స్పష్టమగుచున్నది. దానివ్యాఖ్యాత రామచరణతర్కవాగీశభట్టాచార్యులవారు రసశబ్దమలౌకికానందపరముగాఁ దర్కపాశములచే సాధించుటకుఁ బ్రయత్నముచేసి సమర్థించిరి. కాని దానిని యథార్థముగా నొప్పుకొన వీలుపడదు. వ్యాఖ్యాతయభిప్రాయమే కవియభిప్రాయము మాత్ర మచ్చటఁగాదు. అందువలననే రసగంగాధరమును వ్రాసిన సుప్రసిద్ధాంధ్రుఁడగు జగన్నాథపండితులవారు సాహిత్యదర్పణములోని రసశబ్దము లౌకికార్థబోధకమగుటచేతనే కవిసాంప్రదాయసిద్ధములగు జలప్రవాహవేగోత్పతన నిపతనభ్రమణములు, కపిబాలాదివిలసితములు మొదలయినవర్ణనములే రసముక్రిందికి వచ్చునని ప్రశ్నవేసి దానిని నిరసించినారు. రస మలౌకికమని చెప్పుటఁగో విశ్వనాథపండితులవారిమతము ఖండితము. కనుక మమ్మటాచార్యులవారు చెప్పిన 'తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి'యనునదియు సాహిత్యదర్పణకారుఁడు చెప్పిన'వాక్యం రసాత్మకం కావ్య'మ్మను నదియు గావ్యలక్షణమును బూర్తిగా బోధించుటలేదు.

ఇకఁ గావ్యమన నేమి? రస మాస్వాదింపబడున దని చెప్పితిని. 'రసఆస్వాదనస్నేహనయోః.' ఈయాస్వాదనము లౌకికము కాదనియు బ్రహ్మానందాస్వాదనమువంటిదనియుఁ జెప్పితిని. దీనిచే వస్త్వలంకారప్రధానములైనకావ్యములందు

 

ను శృంగారాదికాలౌకికరసప్రధానకావ్యములందును అలౌకికమును, ఆనందస్వరూపమునై సరసాస్వాదనమును సహృదయులు చేయవచ్చునని తెలుచున్నదిగదా. తన్నిదర్శకముగా బ్రహ్మైవరసః రసోవైసః అనుశ్రుతివాక్యప్రమాణము కలదు. ఈ రసముత్పన్నమగుటకు నానందముత్పన్నమగుటకు జ్ఞానమువలె నర్థమవశ్యమగును. దీనినే శాబ్దబోధమనియు, తాత్పర్యమనియు వాడుచున్నారు. జ్ఞానము సంస్కారమునువలె నిదిశబ్దమునను సరించి యుండుననుట యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఇచట శబ్దము ధ్వనిమాత్రగ్రాహణము. ఇప్పుడు అలౌకికరసమును కావ్యమునకు గావలసినవి. బోధచేయుటకు నర్థయుక్తమైనశబ్దమును అలౌకికరసాత్మక సార్థశబ్దము కావ్యము. ఇందు జన్యజనకభావము జ్ఞానానందములందువలె లేదు.

ఇట్టి కావ్యస్వరూపము మన దేశమున నాశమాయెనది. ఈనాశమెంతకాలముండునో యంతకాలము మన ముచ్చుదశ నొందలేము. కృష్ణదేవరాయభానమంతుఁ డెప్పుడీయాంధ్రలోకమున నస్తమించెనో యప్పుడే యీకావ్యస్వరూపమాంధ్రులహృదయములం దస్తమించెను. దేశము వేషభాషలయందును మతమునందును శత్రువులగు తురకలపాలఁబడెను, ఆంధ్రినిను మాటయడుగంటెను. నుసంస్కృతిను తోఁబరిచయము గలిగి యాంధ్రభాషాస్వరూప మెఱుంగనిపండితులు తెనుఁగు కవులైరి. వారివ్రాతలు సంస్కృతపదభూయిష్ఠము లైనను సంస్కృతకవుల కావ్యములయందలి మాధుర్యము మాత్రము నశించినది ఈకవులందఱు సామాన్యముగా వ్రాసినగ్రంథము లన్నియు కుమారసంభవచరిత్రములో కుమారమనుచరిత్రములో యయ్యెను. ఉపజ్ఞయనునది నామావశిష్టమయ్యెను. ౨౦౦ సంవత్సరములక్రిందటి వఱకు నున్నకవులు వ్రాసినగ్రంథములు లెక్కకు గూర్చునవే కాని పఠనీయములుగా లేవు. వీని కుదాహరణములు చూపవలసినయవసరము లేదు.

చిన్నయసూరి మిత్రలాభము మిత్రభేదము వచనమున వ్రాసి కందుకూరి వీరేశలింగముగారికి దోవఁజూపెను. వీరేశలింగముగారు కొన్ని సంస్కృతనాటకములను దెనిఁగించియుఁ జక్కనివచనగ్రంథములను గొన్నింటిని వ్రాసియు నూత్నయుగమునకు మార్గదర్శకులైరి కాని కేవలకవితాంకూరమును ఆంధ్రయువకులమనముల నాటఁజేసి యాంధ్రవాఙ్మయమునకు భేతాళస్వరూపమును బోఁగొట్టి దేశజను లెవరును మఱచుటకు వీలులేని యుపకారమును తిరుపతివెంకటేశ్వరకవు లొనర్చిరి. నాటినుండియాంధ్రభాషాయోష మరల జన్మించినదని చెప్పవచ్చును.

ఇక తెనుఁగువాఙ్మయము వృద్ధికావలెను. స్వవృద్ధికంటె సాహిత్యాభివృద్ధిని ప్రత్యాంధ్రుడును నిండుమనముతోఁ గోరనియెడల దేశాభివృద్ధియు, తద్వారా జ్ఞానాభివృద్ధియు సమకూరుట దుర్ఘటము!

# అప్పరాయకవీంద్రుఁడు

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, బి. ఎ.

గుత్తునా అని జాతి ముత్యాల్
గుచ్చినాడే నే సరముల
ఇత్తునా అని తెలుగు తల్లికి
ఇచ్చినాడే భక్తితో.

నవవసంతము నవ్వఁ నరిమ
మావికొమ్మల కమ్మ విరులును
పాటపాడెకి పరభృతంబుని
ఎవ్వ రాపెదరో?

పొడుపు మలపై రంగవల్లిక
మింటినడుమ ప్రచండ తేజము
సంజమబ్బుల పైని కెంపులు
చూడకుంటిరిగా !

రంగవల్లిక మాయమయ్యెను
చండ తేజము మాసిపోయెను
సంజకెంపులు సాగిపోయెను
వెదకుచు న్నారా?

కారు చీకటి గ్రమ్మినపుడు
చదల మబ్బులు గప్పినప్పుడె
మిణుగురైనను మెరయనప్పుడె
వెదకు చున్నారా?

యుగయుగంబులనుండి మ్రోగెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీత శీకరముల్ !

చుక్క లన్నియు సొక్కిపోలెను
గిరులు కదలెను; మరల పాడెను
లోకమోహన మధురగానా
స్వాదమోదమునన్!

పాటపాడిన పరభృతంబును
మూగవోయిన ముద్దుకోయిల
జిన్నిపికములు చిరుతపాటల
బిలుచు చున్నారా!



# మాధవీకంకణము

## రమేశచంద్ర దత్తు

### ౧౩

క్రొద్దిరోజులలో నరేంద్రనాథునకు సంపూర్ణారోగ్యము కలిగెను. దేహారోగ్యము కలిగిననేమి? చింతచే నంతఃకరణము వ్యథనొందసాగెను. మన్సూర్ జలేఖా తప్ప ఆయింటిలోనికి మరెవ్వరు వచ్చుటలేదు, ఎవ్వరును మాటలాడుట లేదు. మన్సూరును ఏమయిన నడిగినచో నతఁడు నవ్వి వెడలిపోవును, జలేఖా పెదవులపై వ్రేలిడును. అయినను, జలేఖా యతని దుఃఖమునకు దుఃఖించుచున్నట్లును, ఆపదకు తానాపదయందున్నట్లును స్పష్టముగా తోఁచును నరేంద్రనాథుఁ డెంత యోజించినను నిర్ధారణ చేయలేక పోయెను. తాను వంగదేశమునకు వచ్చెనా? తనయెడ ననుగ్రహముగల సుల్తాన్ సుజా ఆజ్ఞయిచ్చి, నరేంద్రుని రోగదశలో రాజమహాలునకుఁ దెప్పించెనా! కావచ్చును; రాజమందిరములందుఁ గాక యిట్టి విలువగలవస్తువు లెచట నుండును? కాని, సుజా కాశీయుద్ధమున నోడిపోయె ననియు, తాను మృతప్రాయుఁడై శత్రుహస్తములం బడెననియు నతనికిఁ గొంచెము కొంచెముగా జ్ఞప్తి యుండెను. శత్రువులు తుద కాతనిని శూలారోపమున కప్పగించుటకేనా యిట్లు శుశ్రూష చేయుచున్నారు? నరేంద్రుఁడు కొంచెమయినను నిర్ణయింపఁ జాలకుండెను.

రాత్రి రెండుజాముల వేళ నరేంద్రనాథుఁ డేమఁగు దంతపుఁ బీఠమునఁ గూరుచుండి యుండెను; ఎదుట నొక దీపము వెలుగుచుండెను; నరేంద్రుఁడు చెక్కిటఁ జేయి పెట్టుకొని మిక్కిలి చింతామగ్నుఁడై యుండెను.

చింతా సూత్రము విచ్ఛిన్నమై, యతఁ డొకసారి మొగమెత్తి, యెదుట చూడఁగా నతనికేమి కనఁబడెను! జలేఖా సమ్ముఖమున నిశ్శబ్దముగా నిలచి యుండెను. ఆమె ముఖమును పెదవులును పాలి యుండెను, కేశపాశము చెదరి యుండెను; విషణ్ణవదనయై యామె కన్నుల నీరు నించుచుండెను. నరేంద్రుఁ డామెను జూచి, విస్మితుఁడై, 'రమణీ, మీరెవరో వేనెఱుంగను. మీయభిప్రాయ మేమో స్పష్టముగాఁ దెలుపుఁడు!" అని యడిగెను.

జలేఖా బదులు చెప్పక మెల్లఁగా నొక బాష్పకణము విడిచెను.

"మిమ్ము జూడఁగా నేదో యాపదరాబోవునో అనన్నమయినట్లు తోఁచుచున్నది. స్పష్టముగాఁ బలుకుఁడు; ఉద్ధరించుట కుపాయ ముండెనేని ప్రయత్నము చేసెదను," అని నరేంద్రుఁడు మరల మనవిచేసె.

అప్పటికిని జలేఖా మాటలాడక, నిశ్శబ్దముగా కన్నీరు విడిచి, మెల మెల్లన వెడలి పోయెను.

నరేంద్రుఁ డచ్చెరు వొందెను. రాత్రివేళ నిట్లాకస్మికముగా నామె కాన్పించుట కర్థము నించుకయు గ్రహింపలేక, యేదో ఘోర విపత్తు సమీపించె నని తలఁచెను. చెక్కిటఁ జేయి పెట్టుకొని నరేంద్రుఁడా విచారమున మునిఁగి యెన్నో యుపాయముల నాలోచించుచుండెను.

చప్పున గృహములోని దీప మారిపోయెను ఆచీఁకటిలో నొక కొజ్జావాఁడు వచ్చి, తన వెంట రావలయునని నరేంద్రునకుఁ దెలిపెను. నరేంద్రుఁడు భయముతో నాతని వెంటఁ జనెను. ఇరువురు నిశ్శబ్దముగా నెన్ని గృహములు, ఎన్ని యావరణములు దాటి పోయిరో చెప్పఁ జాలము. నరేంద్రుఁడు రాజమహాలులోని ప్రాసాదమును జూచి యుండెను, కాని యిట్టిదాని నెన్నఁడు జూచలేదు. కొన్ని చోటుల స్ఫటిక శిలా నిర్మితములైన మందిరములలో సుగంధ సుందర దీపములు ప్రకాశించుచుండెను. చంద్రకాంత శిలా స్తంభముల మీఁదను వెలగల శిలలతోను, వెండి బంగారములతోను చేసిన కట్టడపుఁ బని వర్ణింప నలవికాదు. కొన్నితావుల ప్రాంగణములందు గుడ్డివెన్నెలలో కేళాకూళులందు జలము నాట్యమాడుచుండెను. నల్దిక్కుల నున్న మనోహరోద్యానమందలి రమణీయ పుష్పలతల మీఁదుగా మందమారుతము వీతెంచుచుండెను. కొన్ని చోట్ల, ఆరామ వృక్షతలంబులఁ గూరుచుండి

తోజ్జ్వల వేషధారిణులు, జాజ్వల్యమానదేహలగు రమణు లొక రిరువురు వీణ వాయించుచునో, లేక నిద్రావస్థయందో యుండిరి. వెలుపల ఖోజ్జాలు నిశ్శబ్దముగా పచారు చేయుచుండిరి. నడుమ నడుమ మృదుస్వరముతో మారుత మాయింద్రనగరి యందు ప్రసరించుచుండెను. తన విపత్తు మఱచి నరేంద్రుఁడు కమనీయ ప్రాసాద, రమ్య హర్మ్య, ప్రాంగ, ణారామములను, అపూర్వ నేపథ్య ధారిణులగు రమణమణులను జూచి యాశ్చర్యము నొందెను. ఆతడెక్కడనున్నాఁడు? ఆ స్థానమేది?

కొన్ని నిముసముల కతఁడు సువర్ణ ఖచితోన్నత ద్వారము నెదుటికిఁ జేరెను; తోడనే కవాటము లోపలినుండి యున్ముక్త మయ్యెను.

నరేంద్రుఁడు ప్రశస్త దీపాలంకృత విశాల భవనముఁ జొచ్చెను. ఆకస్మికముగా చీకటిలో నుండి పెద్ద కాంతిలోనికిఁ గొని పోఁబడుటచే నతఁ డేమియుఁ జూడలేక, దీపకాంతి సహింపఁ జాలక, చేతులతోఁ గన్నులు మూసికొనెను. ఇంతలో, బహురమణీ కంఠ వినిర్గత హాస్య ధ్వని ప్రాసాదము నిండెను.

జీవితకాలములో నరేంద్రుఁ డెన్నఁడు నింత వింత నొందలేదు. తా నెచ్చటికి వచ్చెనో, ఈ జరుగునది స్వప్నమో, లేక ప్రాపంచిక చర్యయో, లేక యింద్రజాలమో! నరేంద్రుఁడు మరల కన్నులు తెఱచెను. కన్నులు జాజ్వల్యమాన తేజః పుంజమున నాతని నేత్రములు మిఱుమిట్లు గొలుప, నీరు గ్రమ్మెను. మరల చేతులతో కన్నులు మూసికొనఁగా తిరుగ బహురమణీకంఠ వినిర్గత హాస్య ధ్వనిచే ప్రాసాదము శబ్దాయమాన మయ్యెను.

కొంచెము సేపటికి నరేంద్రుఁడు చూడఁగల్గినపుడు కనఁబడినవానిచే నతని విస్మయము పదిరెట్లు హెచ్చెను. చంద్రకాంత శిలలతో గట్టిన గొప్ప భవనములోని కతఁడు కొనిపోఁబఁడెను. ఉన్నత స్తంభములపై నున్న లోపలి కప్పునను, కంబముల మీఁదను ఉన్న చిత్రపుఁబని నాతఁ డెన్నడును జూడలేదు. ఒక కంబమునుండి యింకొక స్తంభము మీఁదికి పుష్పమాలికలు వ్రేలాడుచుండెను; క్రింద పూవులు రాశీభూతమై యుండెను. యువతీ కంఠములందు పూదండలు వ్రేలాడుచు పరిమళమును మందిరమున వెదఁజల్లుచుండెను. ఇంటికప్పునుండియు, స్తంభములనుండియు, ప్రసూన పత్రరాశి మధ్యమునుండియు అనేక సుగంధ దీపికలా సుందర మందిరమును కాంతివంతమును, సువాసితమును జేయుచుండెను. రేఖాకారముగా నెందరో సుందరాంగనలు నిలిచి యుండిరి. ఆ రేఖ నడుమ ప్రదీప ప్రభా ప్రతిస్పర్ధి యగు రత్న సింహాసనముపై వారల రాణి యుపవిష్టయై యుండెను. ఇది స్వప్నమా? లేక యింద్రజాలమా? ఆలిఫ్ లైలా అను పుస్తకమున అబుల్ హసన్ అను నొక దరిద్రుఁడు ఒక నాఁడు నిద్రలేచి, తాను బాగ్దాదు ఖలీఫ్ అయినట్లు చూచిన కథను నరేంద్రుఁడు చదివి యుండెను. నరేంద్రుని స్వప్న మంతకంటెను ఆశ్చర్యకరము; ఆకస్మికముగా తాను దైవతోద్యానమున నచ్చరలచే పరివేష్టితుఁ డయినట్టు లాతఁడు విలోకించెను!

నరేంద్రుఁ డాయచ్చరలు కాక, స్త్రీలవంకఁ జూచెను. వారు నిశ్శబ్దముగా నిలిచి యుండి, తమతమ ఱొమ్ములపై చేతులు పెట్టుకొని, నేలవంకఁ జూచుచు, నిర్జీవ ప్రతిమలవలెఁ గానఁబడుచుండిరి. వారి కేశ పాశములనుండి వెలువడు మాణిక్య ప్రభ దీపావళిని పరిహసించుచుండెను; బహుమూల్య వస్త్రము లాకాంతి యందు ఉజ్జ్వలతరము లయ్యెను. వారెల్లరు రాణి యానతికై వేచి యుండిరి.

ఆ రాణి వంకఁ జూచినప్పుడు నరేంద్రుఁడు నూఱుమడుగు లాశ్చర్య మొందెను. ఆమె యౌవనము దాటి పోయినను పడుచుఁదనపు సౌందర్యము, ఉన్మత్తభావము ఇంకను వీడలేదు; ప్రథమ యౌవనావేగము, లాలసయు వయస్సుతో వృద్ధి నొందుచున్నట్లు బోధపడును. ఆమె శరీరము పొడవుగను, ముఖము పెదవులును ఎఱ్ఱగాను ఉండెను; నల్లని కేశపాశమున అమూల్య వజ్రఖండ మొకటి కాంతితో ధగధగలాడుచుండెను. నేత్రము లంతకంటెను జ్యోతిర్మయములు; ఆమె మేలిముసుగా కాంతిని మఱుగు పెట్ట లేకుండెను. చూడఁగనే ఆమె—స్త్రీ కాని, అచ్చర కాని, ఎవ రయినను—అసాధారణ మహిళ యనియు, భూమి

నో స్వర్గమునో శాసించుటకు నవతరించెనని యూఁదోచును.

దీని నాతను విలోకింప నరేంద్రున కవకాశము లేకుండెను. శీఘ్రముగా వాద్యములనుండి తానము బయలుదేరెను; దానితో నూర్వురు యువతుల కంఠధ్వనులు సమ్మేళన మొందెను. అట్టి యపూర్వ సంగీతమును నరేంద్రుఁ డెన్నఁడు విన లేదు. అతని శరీరము పులకరించెను. నిశ్చేష్టుఁడై యతఁడా గానము నాకర్ణింప సాగెను, ఆసంగీతము క్రమ క్రమముగా హెచ్చి, ప్రాసాదమును దాటి ఆకాశమున వ్యాపింపఁ జొచ్చెను. గగన సంచారులగు నదృష్టజీవు లాగానమునకు సహకారులై నూరు గుణములు వృద్ధి చేయుచున్నట్లు తోఁచెను. మరల గీతము క్రమముగా మందీభూతమై లీనమై పోయెను, ప్రాసాదము తిరుగ నిశ్శబ్దమయ్యెను. ఇవ్విధముగా గీతధ్వని మూఁడు పర్యాయములు కర్ణగోచరమై తుదకు లీన మాయెను.

అంతట రాణి సత్తువకొలఁది పదాఘాతము చేయఁగా ఆమందిరమున నొక ప్రక్క ఎఱ్ఱని తెర జారెను. నరేంద్రునకు భయము కలుగునట్లు రెండవ ప్రక్కన ఖడ్గధారములు పట్టుకొని, రక్తాంబరధారులు, కృష్ణదేహులు నగు నలుగురు కొజ్జాలు నిలువఁబడి యుండిరి. రాణి మరల పదాఘాతము చేయుటచే వారిలో ముఖ్యుఁ డొకఁడు సింహాసనము దగ్గఱకు వచ్చి నిలచెను. అతఁడు మస్రూర్! నరేంద్రుని నాడులందు రక్తమింకి పోయెను.

మస్రూర్ మృదుస్వరమున రాణితో కొంతసేపు మాటలాడుచుండెను; వానివాక్యములు నరేంద్రునకు వినఁబడలేదు; కాని మాటలాడునపుడు నడుమనడుమ మస్రూర్ నరేంద్రునివంక వ్రేలుపెట్టి చూపుచు, పండ్లు కొఱుకుచు, కన్నులెఱ్ఱచేసికొని, రాణి నుత్తేజింపఁ జేయుచున్నట్లుండెను. మస్రూరుమాటలు తెలియకపోయినను అంగభంగిని జూడ నరేంద్రునకు వెఱపు కలిగెను; ఈక్రొత్తదేశమున శూలారోపణముచే మృతినొంద వలసియుండునని దుఃఖము కలిగెను.

రాణి మరల పదాఘాతము చేసెను. తోడనే రెండవ దిక్కునుండి పచ్చని తెర పడెను. హరిద్రాంబరధారిణు లగు పరిచారికలు నలుగురు నిలుఁవబడి యుండిరి. రెండవసారి కాలితో తన్నుటచే ఆ పరిచారిక లొక ఖైదీని రాణి సమీపమునకుఁ బట్టుకొని వచ్చిరి. ఆమె జలేఖా. నరేంద్రుఁ డాశ్చర్యపడెను.

జలేఖా యేమి పలికెనో నరేంద్రునకు వినఁబడ లేదు; కాని యామె యాకారమును జూచి రాణి నామె ప్రార్థించుచు, కన్నీటితో రాణి పాదములపైఁ బడినట్లు తెలిసికొనెను.

మాటిమాటికి రాణి నరేంద్రునివంకఁ జూచుచుండెను నరేంద్రుని దేహకాంతి సహజముగ పచ్చనిది, నేత్రములు తేజోవంతములు, లలాట మున్నతము, ముఖము పరాక్రమసూచకము. తరుణుఁడు, సుందరుఁడు, సాహసియు నగు నరేంద్రునిదెస నామె మాటిమాటికిఁ జూచుచుండెను.

కొంతసేపు చూడఁజూడ నాతనివ్రేలిపై నొక యుంగరము రాణికిఁ గానబడెను. పాపము! నరేంద్రుఁడు రోగపీడితుఁడై యున్నప్పుడు జలేఖా యొకనాఁడు మిలాసార్థ మాయుంగుఁళయము నాతనివ్రేలికిఁ బెట్టెను; అప్పటినుండియు నది యతనిచేత నున్నది. ఉంగరమును రాణియు పరిచారికలును గుర్తించిరి, అంతట క్రోధముచే రాణి సుందరవదన మెఱ్ఱవాఱెను, నేత్రముల నుండి విస్ఫులింగములు రాలెను.

విచారణ ముగిసెను. రాణి కఠినముగా నిట్లాదేశించెను: “ఈ పాపాత్మురాలిని శూలారోపణ చేయింపుము; కాఫరును ఏనుఁగు పాదములక్రింద వేయుము!”

తటాలున నొక్కసారిగా దీపములన్నియు నాఱిపోయెను. చీఁకటిలో నిశ్శబ్దముగా కొజ్జాలు నరేంద్రుని త్రాటితో బంధింపసాగిరి.

అంధకారమున నెవ్వరో నరేంద్రుని నోటికడ నొకపాత్రను బట్టిరి. అతఁడు విస్మయోద్వేగములచే తృషాపీడితుఁ డగుటవలన పాత్రములోని పానీయమును త్రాగెను. తోడనే తెలివి తప్పెను. అటుపిమ్మట నేమి జరిగెనో యతనికిఁ తెలియదు. ఆచీఁకటిలో నెవ్వరో వచ్చి, చేతి యుంగరమును దీసికొన్నట్లును, కరుణాస్వరముతో దుఃఖించుచున్నట్లును మాత్ర మాతనికి గోచరించెను. స్వప్నమునను నరేంద్రుఁడు దీనురాలగు జలేఖాను జూచెను.

నరేంద్రనాథునికి తెలివివచ్చి చూచునప్పటికి సూర్యోదయ మయ్యెను. నీరెండలో నాతఁడొక

వీధినడుమ నొకఁడే పక్కి పందుకొనియుండెను. తరుణారుణ కిరణజాల పతనిమ్నముఖముపైఁబడి సర్వమును తేజోమయ మొనర్చెను. అది యేపట్టణము? వంగదేశరాజధానియగు రాజమహల్ నగరమా యది? సుల్తాన్ సుజా యనుగ్రహించి తన్ను కాశీనుండి యిచ్చటికిఁ దెప్పించెనా? గతరాత్రమున నతఁడు నేలపైఁ బండుకొని స్వప్నమున మేడలను అప్సరసలను గాంచెనా?

## ౧౩

నరేంద్రుని యాశ్చర్యమునకుఁ బారము లేకుండెను. ఆప్రదేశ మతఁడెన్నఁడును జూచినది కాదు. అది పెద్దసత్రముగనె నుండెను. నడుమ విశాల ప్రాంగణము, దానికి నల్వంకల రెండంతస్థుల మేడలచాలు, ప్రతి ప్రకోష్ఠమునం దొకరిద్దఱు మనుష్యులు నుండిరి. వారెల్లరు చాలవఱకు పెద్దమనుష్యులు; పారసీకులు, ఉజ్బెక్కులు, పఠానులు, హిందువులు; అందఱు వర్తకులు. క్రొత్తగా నగరమునకు వచ్చి యీ సత్రములో జనులు నివసించుచుందురు రాత్రి బాటసారులెల్లరు సత్రములోనికి వచ్చినతరువాత తలుపులు మూసి, ప్రాతఃకాలమున పురల సింహద్వారమును దెఱచినతోడనే జనులు రాకపోకలు చేయుచుందురు.

ముసలి పారసీక షేక్ సాహెబొకఁడు ఆంగణమునఁ గూరుచుండి పొగాకు నములుచుండెను. నరేంద్రుఁడాతని కడకేఁగి «షేఖ్ జీ, ఈ ప్రదేశము పేరేమి? నేనిచ్చటికి క్రొత్తగా వచ్చినాను అంతయును నూతనమే," అని చెప్పెను. «బాబా నేనుగూడ వ్యాపారముమీఁద నిన్ననే యీనగరమునకు వచ్చినాను; విశేషములు నాకు దెలియవు," అని షేక్‌సాహెబు పలికెను.

«తమకు నాకంటె హెచ్చుగాఁ దెలియును ఈ ప్రదేశము సంగతి కొంచెము చెప్పుడు."

«నిజముగాఁ జెప్పుచున్నాను. నేనీనగరమెంతమాత్రి మెఱుఁగను: అయినను, ఇది బేగం సాహెబాలసత్రము. పాదుషాగారి పెద్దకూతురు క్రొత్తగావచ్చినవారి వీలుకొఱకు యీసత్రమును గట్టించెనని విన్నాను. నేను సమర్‌కంద్ బుఖారా, షిరాజ్, ఇస్పహాన్ నగరములను జూచినాను; కాని యింతచక్కని నగరము చూడలేదు."

"ఈనగరము పేరేమి? బాదుషా యెవ్వరు? బేగము లెవరు?"

మాసలివర్తకుఁడు తీక్ష్ణదృష్టితో నా పడుచువానిని జూచి, సేవకు నొకనిఁ బిలిచి, «చూడగా ఈకాఫరు బుద్ధిహీనుఁడువలె నున్నాఁడు. ఈ పిచ్చివానిని వెడలఁగొట్టు! పిచ్చివల్ల ఏమిచేసి పోవునో!" అని యాజ్ఞాపించెను. నరేంద్రుఁ డుపాయము లేదని యచ్చటనుండి తొలఁగిపోయెను.

పిమ్మట, పండ్లను విక్రయించుటకయి ధనిక వర్తకుల కడకుఁ బోవుచున్న యొక పఠాన్ స్త్రీని జూచి, నరేంద్రుఁ డామె దగ్గఱకుఁ జని, «బీబీ ఈపట్టణము పేరేమి? ఈప్రదేశము నేమంగురు?" అని ప్రశ్నింప నామె యాశ్చర్యపడి, క్షణమాత్రము నరేంద్రునివంకఁ జూచి, «కాఫర్, నేను పడుచుదానను గాను; పరిహాసము లాడుటకు వేఱొకచోటికి వెళ్ళు. ఈ చక్కని మొగము చూచిన భోగస్త్రీలు మఱల వచ్చు వయస్సు లేదు!" అని పలికెను నరేంద్రుఁ డప్రభుతిఁ డయ్యెను.

తరువాత, ఎదుట నిలిచి యున్న యొక రాజపుత్ర సైనికుని నరేంద్రుఁడు చూచెను. సేవకుఁ డాతని గుఱ్ఱమునకు మాలీసు చేయుచుండెను. యోధుఁడు సంసిద్ధుఁడై కార్యము శీఘ్రముగా ముగింపుమని సేవకునితోఁ జెప్పుచుండెను. నరేంద్రుఁ డాయనతో, «అయ్యా, నే నిచ్చటికి క్రొత్తగా వచ్చినవాఁడను, ఈస్థానము పేరే తెలియదు. తను రిచ్చట బహుకాల మున్నట్లు తోఁచుచున్నది. అనుగ్రహించి, యీపురవిశేషములు కొంచెముగాఁ జెప్పఁగలరా?" అని యడిగెను. రాజపుత్రుఁడు కొంత తడవు నరేంద్రునివంకఁ జూచి, «బాబూ, నీముఖము పూర్వము చూచినాను, నీవు వంగదేశమునుండి వచ్చితివి కావా? అవును, జ్ఞప్తికివచ్చినది- నీవు నన్నింతలోనే మఱచినావా?" అనెను.

నరేంద్రుఁడు రాజపుత్రుని నిదానించి చూచి, «మఱవలేదు. గజపతిసింగుజీ, మీరు నన్ను కాశీయుద్ధము తరువాత రక్షించినారు. ఈజన్మములో మిమ్ము విస్మరింపఁ జాలను!" అని పలికెను.

ఇరువురు చాలసేపు సంభాషింపఁ జొచ్చిరి. హిందూస్థాన రాజధానియగు ఢిల్లీనగర మిదియే యని తెలిసికొని నరేంద్రుఁ డాశ్చర్యపొందెను. మా

టపై మాటమీఁద గజపతి యిట్లనెను: "నేను జయసింగు మహారాజుగారి సన్నిధినుండి కొన్ని కాకితములను దీసికొని జస్వంతసింగు మహారాజు గారి సముఖమునకుఁ బోవుచున్నాను. ఔరంగ్‌జేబుతో యుద్ధము కయి వారు ప్రస్తుతము ఉజ్జయినికి వెళ్ళినారు. యుద్ధము కాకపూర్వము నేనచ్చటికిఁ జేరుదునేని శుభమగును. నీకిష్టమయినచో నావెంట రమ్ము. మహారాజుగారికి విన్నవించి, అశ్వికదళములో నీకు ఉద్యోగ మిప్పించెదను." బంధుహీనుఁడు, అర్థహీనుఁడు నగు నరేంద్రుఁడా ప్రస్తావన కంగీకరించెను. పిమ్మట నిర్వురు దిల్లీనగరమును సందర్శించుటకు బయలుదేరిరి.

మహా భారతమునందుఁ బేర్కొన్న యింద్రప్రస్థ నగర మెచ్చట నుండెనో భారతవర్ష శేష హిందూ చక్రవర్తి యగు పృథ్వీరాయుని రాజధాని దిల్లీ నగర మచ్చటనే యుండెను. ఈ కథా కాలమునకుఁ గొన్ని సంవత్సరములకు ముందు షాహజహాన్ చక్రవర్తి యచ్చోటనే నూతనముగా రాజధాని సంస్థాపించి, చక్కని ప్రాసాదము మొదలగువానిని, దుర్గమును నిర్మించి, నగరమునకు షాహజహానాబాద్ అని పేరు పెట్టెను. కాని యాపే రెవ్వరు నెఱుఁగరు; నేటికిని దిల్లీనామమే విశ్రుతమై యున్నది, పృథురాయుని నాఁటి నామమే యిప్పటికిని గలదు.

దిల్లీకి నొకప్రక్క యమునా నదియు, ప్రక్కన మూడు వైపులను అర్ధగోళాకారముగా ప్రాకారమును గలవు. ప్రాకారము మీఁదుగా రాకపోకల కొక మార్గమున్నది. యమునకు ప్రాకారమునకు నడుమగా దిల్లీనగర మున్నది. ఆవరణమునకు వెలుపల నాలుగు పెద్ద పేట లున్నవి; అందు ధనాఢ్యులగు ఉమ్రాహుల యొక్కయు, రాజుల యొక్కయు మేడలు ఆరామములును చాలదూరము వఱకుఁ గానఁబడుచుండును. దిల్లీ నగరమునకు లోపలను, యమునా నదికి సమీపముననూ పాషాణ ప్రాకార పరివేష్టితమగు దుర్గము చక్రవర్తి యొక్క ప్రాసాదము, అద్వితీయమైన చంద్రశిలా నిర్మిత హర్మ్యములును గలవు.

గజపతియును నరేంద్రుఁడు నొకప్రధాన మార్గము వెంట పూర్వాభిముఖముగాఁ జనుచుండిరి. నగర మంతయును మించుమించుగా సైనికులతో నిండియుండెను; అందు ముప్పదివేల సేన నివసించుచున్నది. సైనిక కుటుంబములు, సేవకుల నేకులు నగరమునందు మట్టిగోడల ప్రాంగణముల యందు నివసించుచుండిరి; కావున నగర మిట్టి కుటీరములతో నిండియుండెను. ఖాద్య ద్రవ్యములను వస్త్రాదులను విక్రయించు దుకాణములనేకము లాకుటీరములే యగుటచే సాధారణముగాఁ బ్రతి సంవత్సరము వందలకొలఁది దగ్ధములగుచుండెను. నరేంద్రుఁ డిరుప్రక్కల నిట్టి కుటీరములను జూచుచుఁ బోవుచుండెను. దుకాణదారులు పచారి ద్రవ్యములు విక్రయించుచుండిరి. మార్గము జనాకీర్ణముగా నుండె. సామాన్య వేషధారులగు జనులు చాలమంది [illegible] పనులపై వెళ్ళుచుండిరి. మధ్యశ్రేణి గృహస్థులు పెద్దలు నిప్పుడు ఇటుకలతో గృహములు నిర్మించి నగరమున కందము దెచ్చినారు; కాని రెండువందల సంవత్సరములకు ముందా మాటయే లేదు. అప్పుడు మహాలోకము మేడలయందును, సామాన్యజనము కుటీరములందు నుండెడిది.

పోయి పోయి నరేంద్రుఁడొక ఘంటాపథము చేరెను. ఆమార్గమున కిరువంకల మేడలుండెను. మన్సబ్‌దారులు, కాజీలు, ఉమ్రాహులు, వర్తకులు, రాజులు, మొదలగు మహాజనులు హర్మ్యశ్రేణులనుండి మార్గమును జూచుచుండిరి. నరేంద్రుఁడిట్టిమేడల నెచ్చటను జూడలేదు. మేడల ప్రక్కఁ జనుచు నతఁడు గజపతిసింగుతో సంభాషింపఁ జొచ్చెను. కొంచెము దూరము పోవునప్పటికి సుప్రసిద్ధమగు జుమ్మామస్‌జద్ దృగ్గోచరమయ్యెను. అట్టిది భారతవర్షమునందే కాక ప్రపంచమునం దెచ్చటను ఉన్నట్లు తోఁచదు. విస్మితుఁడై నరేంద్రుఁడు, "ఎదుట గనఁబడు పెద్దమసీదు పేరేమి?" అని గజపతిసింగు నడిగెను.

"అది జుమ్మామసీదు. ఒక పర్వతము మీఁది భాగమును చదును చేసి, దానిపై నీమసీదు నిర్మించిరని వింటిని. దాని రక్తవర్ణముచే కన్నులు మిఱుమిట్లు గొనుచున్నవి. దానిపై తెల్లరాతితోఁ గట్టిన మూఁడు గుంబాజులున్నవి. పాదుషా దిల్లీనగరమున నున్నప్పుడు ప్రతిశుక్రవార మీమసీదునకు వచ్చును; ఆ సన్నాహము చూచినచో నెన్నఁటికి మఱపురాదు. దుర్గమునుండి

మసీదువరకు నాలుగైదువందలకంది సిపాయీలుబారుతీరి నిలిచియుందురు; వారి తుపాకుల మీఁద చక్కని యెఱ్ఱజెండా లెగురుచుండును అయిదాఱుగు రాశ్వికులు త్రోవచేయుచు ముందు వత్తురు. తరువాత, ఏనుఁగుమీఁద జాజ్వల్యమాన సింహాసనమున పాదుషా విచ్చేయును. అటుపిమ్మట ఉమ్మరాహులు, మన్సబ్‌దారులు, మంచిదుస్తులతోఁ జనుదెంతురు. అయితే ఇచట నిలిచియున్న నేమి లాభము? నడువు దుర్గము లోనికిఁబోయి, రాజభవనములను జూతము," అని గజపతి చెప్పెను.

దూరమునుండి, యెత్తుగా నున్న యెఱ్ఱని ప్రాకారసౌందర్యముచూచి నరేంద్రనాథుఁ డాశ్చర్యమొందెను. ఆ కాలమున భారతవర్షమున కెచ్చటెచ్చటనుండి వచ్చిన బాటసారులు ఢిల్లీనగర దుర్గమును ప్రాసాదమును తెల్లరాతితోఁ గట్టిన మసీదును, హర్మ్యములను విలోకించి, యిట్టివి ప్రపంచమున మఱిలేవని వర్ణించి పోవుచుండెడివారు. దుర్గప్రవేశస్థానమున విస్తీర్ణాంగణము కలదు. దానియందు హిందూరాజు శిబిరము కలదు. ఆ రాజు దుర్గద్వారము రక్షించుచుండును. రౌతులు, ఉమ్మరాహులు నిరంతర మిటునటుపోవుచుండిరి. దుర్గమునుండి సిపాయీలు వెలుపలికి రాకపోకలు చేయుచుండిరి. విదేశీయ వణిజులు దుర్గద్వారమునఁ గూడుచుండిరి. వేలకొలఁది యితరజనులు నదీప్రవాహమువలె నిటునటుఁ బరువెత్తుచుండిరి.

ద్వారదేశమున పాషాణగజములు వానిపై మనుష్యాకృతులు నుండెను. నరేంద్రుఁ డుత్సుకుఁడై యా ప్రతిమూర్తు లెవరివో యని యడుగ గజపతి యిట్లనెను: "హిందువులు మీ రెఱుఁగరా! వీ రిద్దఱు రాజపుత్రవీరులు. జయమల్లు పత్తు అనువారు అక్బరుతో యుద్ధమున చిత్తోడు దుర్గమును రక్షించుచుండిరి. తరువాత కాపాడ లేనప్పుడు పారతంత్ర్యము నంగీకరింపక యుద్ధమున నిహతులయిరి. మా తాత తిలకసింగు ఆ యుద్ధమున ప్రాణము లర్పించెను. నా తండ్రి తేజసింగుగారి వలన ఆ వృత్తాంతము చిన్నతనమున వినుచుండెడివాఁడను. పత్తు తల్లియు భార్యయు వీరాంగనలు, వారుకూడ యుద్ధమున పరాక్రమము చూపి మృతి నొందిరి. వారి యశోజ్ఞాపకార్థము అక్బరు పాదుషా ఈ విగ్రహముల నిచటఁ స్థాపించెను."

(గర్వముతో) "కాని రాజపుత్రరాజులకీర్తి చిరస్థాయిగా నుండుటకు విగ్రహములతో పనిలేదు. పరాక్రమమునకు గౌరవ ముండునంతకాలము రాజపుత్రనామము నెవ్వరు మఱచిపోరు. రాజస్థానమున ప్రతిపర్వతశిఖరమందును రాజపుత్రవీరులకీర్తి అంకితమై యున్నది; భారతవర్షమునందలి వేగవంత మయిన ప్రతినదీప్రవాహ తరంగములయందు శబ్దాయమాన మగుచున్నది!"

ఘంటాపథమును దాటి యిద్దఱు దుర్గములోఁ జొచ్చిరి. మార్గమున కిరువంకల నున్న మేడలలో రాజసేవకులు తమతమపనులు చేయుచుండిరి. దుర్గద్వారమును వెలుపల హిందూరాజు రక్షించుచున్నట్లు లోపల మార్గముకడ మన్సబ్‌దారులు ఉమ్మరాహులు దుర్గద్వారము నరక్షించుచుండిరి.

ఇరువురును దుర్గములో పెద్దపెద్ద కారఖానాలు చూచిరి. రాజపరివారమునకుఁ గావలసిన విచిత్రవస్తువు లన్నియు నీకారఖానాలయందే తయారుచేయఁబడును. ఒకచోట పట్టుబట్టలు నేయువారు, ఒకచోట స్వర్ణకారులు, ఒకచోట చిత్రకారులు నుండిరి; జోళ్ళుకుట్టువారు, దర్జీలు, వస్త్రములు నేయువారు నుండిరి. దేశమున నున్న పనివాండ్రు ప్రాతఃకాలమునుండి సాయంకాలము వఱకును పనులు చేయుచు నెలజీతములు పుచ్చుకొనుచుందురు.

ఈ కర్మాగారముల నన్నిటిని దాటి యుభయులును దుర్గలోనికిఁ బోవసాగిరి. చాలసమ్మర్దమునుండి, విస్మయకరములగు ననేక హర్మ్యముల ప్రక్కనుండి చని, వారు తుదకు జగద్విఖ్యాతము చంద్రకాంత శిలా నిర్మితమునగు 'దివాన్ ఖాస్' ప్రాసాదమును గాంచిరి. దాని లోపలిభాగము సువర్ణమండితమై, సూర్యకాంతిచే ధగధగ లాడుచుండెను. ప్రాసాదమున వజ్రకాంచన ఖచితంబును సూర్యకాంతి ప్రతిఘాతియు నగు సింహాసనమున షాహజహాన్ చక్రవర్తి యుపవేశించి యుండెను. ఆయన శాంతగంభీర ముఖమింకను రోగచిహ్నాంకితమై యుండె; ఇంకను సంపూర్ణారోగ్యము కలుగలేదు. దక్షిణపార్శ్వమున పెద్దకుమారుఁడు దారా కూరుచుండెను. అతని ముఖ మందమయినదే, కాని దుర్దమనీయదర్పము కానఁబడుచుండెను. ఎడమప్రక్క పౌత్రుఁడు సుల్తాన్ సులేమాన్ నిలువఁబడియుండెను. అతని కిరువదియైదు సంవత్సరము

ఉండును; ఉన్నతకాయుఁడు, సుందరుఁడు, వెనుకవైపున కొజ్జాలు, నెమలియీకలచామరములు వీచుచుండిరి. నాలుగువైపుల నున్న కటకటాలు వెండివి. వాని కీవల రాజులు, ఉమ్మరావులు, మన్సబ్‌దారులు, దూతలు, సేనాపతులు, భారతవర్షమునందలి ప్రధానపురుషులును ఉచిత వేషభూషలు దాల్చి, కృతాంజలులై నేలవంకఁ జూచుచు నిలిచియుండిరి. ఎదుటి సమతలమున జనులు నిండియుండిరి. ధనవంతుఁడు గాని నిర్ధనిగాని, ఉన్నతుఁడుగాని నీచుఁడుగాని యెల్లరు నచటికిఁ బోయి పాదుషా దర్శనము చేయుట కధికారము గలదు. ఆ మహాప్రాసాదమున యథార్థముగ నిట్లు వ్రాయఁబడి యుండెను. "ప్రపంచమున స్వర్గ ముండు నేని ఇది స్వర్గము, ఇది స్వర్గము, ఇది స్వర్గము !"

పాదుషా యెదుట మొదట అరబ్బీగుఱ్ఱములు తరువాత గొప్పయేనుఁగులు ప్రదర్శింపఁబడెను. మాతంగములు తుండము లెత్తి బాదుషాకు సలాము చేసి వెడలిపోయెను. పిమ్మట లేళ్లు, వృషభములు, మహిషములు, ఖడ్గమృగములు, పులులు మొదలగు జంతువులు, పిదప వివిధ విహంగములు నొక్కటొక్కటిగాఁ జూపఁబడెను. అనేకయుద్ధములు చూచిన భటులు, సామాన్యసైనికులు చక్రవర్తి సమ్ముఖముగాఁ జనిరి. వారల పదభరముచే భూమి వణఁకెను.

ప్రదర్శనము ముగిసిన తరువాత బాదుషా దరఖాస్తులు గ్రహింపఁజొచ్చెను. కొద్దివారు గొప్పవారు అందఱు నేతెంచి భారతవర్ష రాజాధిరాజు సన్నిధిని తమతమ కష్టములను విన్నవించుకొన సాగిరి. ఒకటిరెండు మాటలతో చక్రవర్తి వారివారి కష్టములను తొలఁగించుచుండెను. పాదుషా యేవిషయమున నేమాట చెప్పినను ప్రధాన ఉమ్మరావులు 'కేరామత్, కేరామత్!' అని ప్రభువును ప్రశంసించుచుండిరి.

రెండుగంటలలో రాజకార్యములు ముగిసెను. చక్రవర్తి తనకుమారునితోను, ముఖ్యులైన కొందఱు ఉమ్మరావులతోను 'గోసల్‌ఖానా'కు వెళ్లెను. 'గోసల్‌ఖానా' కాలుచేతులు కడుగుకొనుటకే నిర్మింపఁబడలేదు; అచ్చట ప్రధానామాత్యులతో చక్రవర్తి రాజకార్యములను గూర్చి రహస్యాలోచన చేయుచుండును.

'గోసల్‌ఖానా'కు వెనుక ఎత్తయిన యొక ప్రాకారము నరేంద్రునకుఁ గానఁబడెను. దాని కావల నెన్నో మేడలు కలవు. గజపతి యిట్లనెను: "ఈగోడకు వెనుక రాజమందిరము, బేగములకు వేర్వేఱు మహాలులు నున్నవి; అవి చాల చిత్రముగా నుండునని విన్నాను. ఒక్కొక బేగముకు మేడ, నాలుగు వైపుల నుద్యానము, లతాగృహము నుండును. వేసవికాలమున పగలు గడపుటకు స్వర్ణమయము లయినగృహములును, రాత్రి శయనించుటకు రాతికట్టడములును కలవు. కాని, చక్రవర్తితప్ప నితరపురుషుల నేత్రము లాసౌందర్యము నెన్నఁడును జూడలేదు; పురుషుల పాదచిహ్నమాత్రమ్యు స్థానములం దంకితము కాలేదు."

కడచిన రాత్రి సంగతులు తటాలున నరేంద్రనాథునకు జ్ఞప్తివచ్చెను. ప్రాకారములో నున్న బేగముల మహాలుల రామణీయకము తన నేత్రములు వీక్షించినట్లును, తన పాదచిహ్నము లారమణీయప్రదేశములం దంకిత మయినట్లును అతనికిఁ దోఁచెను. కాని, గత రాత్రమునందలి విస్మయజనక వృత్తాంతముల నతఁడు గజపతిసింగునకుఁ బ్రకాశము చేయలేదు; తానుగూడ సరిగా గ్రహింపలేకుండెను!

౧౪

ఇరువురు దుర్గము వెలువడి, వెలుపల నున్న విశాలాంగణమును జేరిరి. ఆప్రదేశ మప్పటికిని జనాకీర్ణమై యుండెను. పెద్దపెద్దవారు కొందఱు మేనాలలోను, కొంద ఱేనుఁగులమీఁదను, కొందఱు గుఱ్ఱములపైనను ఇటునటుఁ జనుచుండిరి. విలువగల నూతన చిత్రవస్తువుల ననేకులు విక్రయించుచుండిరి; వానిని గొనుటకుఁ గాని, చూచుటకుఁ గాని యనేకులు త్వరితముగా వచ్చుచుండిరి. కొందఱు సంగీతము పాడుచు, నృత్యము చేయుచు ధనము యాచించుచుండిరి, కొందఱింద్రజాలము చూపుచుండిరి; కొందఱు పాముల నాడించుచుండిరి; కొందఱు సాముద్రికము చెప్పుచుండిరి. గణికుల మని చాలమంది యచటి కరుదెంచి, యెండలోను జీర్ణవస్త్రములు పఱచి కూరుచుండిరి. ప్రతివానికి నొకప్రక్క యంత్రము రెండవవైపున నొక పుస్తకము నుండెను. చాలమంది వారి సమీపమున గుమిగూడుచుండిరి. స్త్రీలు సైతము తెల్లబట్టలు గట్టుకొని వ్యగ్రభావముతో నేతెంచి ఒక్కొక పైసా యిచ్చి చేయి చూపించుకొనుచుండిరి.

వారినడుమ నరేంద్రుఁ డొకవింత జ్యోతిష్కుని గాంచెను. అతనికిఁ బదునాలుగు సంవత్సరముల కంటె నెక్కువ వయస్సుండదు; ముఖము కోమలము, మిక్కిలి గౌర వర్ణము, సూర్యతాపముచే నెఱ్ఱవాఱి యుండెను. కన్నుల, చెక్కిళ్ళ, మెడలపై జడలు వ్రేలాడు చుండెను. జటాభారముచే కొంచెము మాటుపడి యున్నను నేత్రములనుండి యగ్ని స్ఫులింగ కాంతి వెలువడుచుండెను. శరీర మాపాదమస్తకము కృష్ణవసనావృతము. చాల విలువగల చందువా పెట్టె యొకటి అతని దగ్గఱ సూర్యకాంతిలో ధగధగ లాడుచుండెను. బాలుఁడు తాత్తార వేశ ముసల్మాను; ఎవరి దగ్గఱ డబ్బులు తీసుకొనకుండగనే చేతులు చూచు చుండెను.

తాత్తార బాలుని యాకారము నవలోకించి యనేకు లాతని సమీపమున కేఁగుచుండిరి. గజపతియు నరేంద్రుఁడును వానికడ కరిగిరి. గజపతి మొదట చేయి చూపి, "నేఁటి సాయంకాలము నేను ఢిల్లీ నగరము విడచి యెక్కడకుఁ బోవుదమో, చెప్పు?" మనెను.

తాత్తారుఁడు గజపతి ముఖమును వస్త్రములను పరిశీలించి చూచి "జస్వంతసింగు మహారాజుగారు నర్మదా తీరమునకు వెళ్ళినారు; మీరు గూడ నచటికిఁ బోవుదురు," అని చెప్పెను.

గజపతి పెద్దపెట్టున నవ్వి, యిట్లనెను: "జస్వంత సింగు మహారాజుగారు ఔరంగజేబుతో యుద్ధము చేయుటకు వెళ్ళిన సంగతి ఆబాల వృద్ధ మందఱకును దెలియును. నా వస్త్రములను జూచి నన్ను రాజపుత్రుఁ డని యెల్లరు చెప్పఁ గలరు. ఇంతకంటె నెక్కువ సంగతులు చెప్పఁ గల విద్య లేదా నీకు?"

తన జాజ్వల్యమాన నేత్రములను గజపతిపై తీవ్రముగా నిల్పి, మస్తకము నాడించి, జటాభాగము వెనుకకుఁ ద్రోసి బాలుఁ డిట్లనెను; "రాజపుత్రా, యింకను జెప్పఁగలను. ఔరంగజేబుచే రాజపుత్రులు నిహతు లగుదురు. వడిగల గుఱ్ఱము నొకదానిని వెదకి యుంచవలెనని మహారాజుగారితోఁ జెప్పుఁడు; కానిచో పలాయనమున కవకాశ ముండదు. ఏడు వేల రాజపుత్రులతో ఏడువందల మందికూడ దక్కరు. రాజపుత్రా, ఆయుద్ధమున మీకు మరణము తప్పదు!" గజపతిసింగు పరాక్రమ వంతుఁడు, సాహసి; కాని తాత్తారబాలుని ముఖభంగిని గంభీర స్వరమును, ఉజ్వల నేత్రములను గమనించి క్షణకాల మలికిపడెను; తోడనే యదరిపాటు తొలగెను. అంత నతఁ డత్యంత గంభీరస్వరమున నిట్లు పలికెను: "నష్టములేదు భగవంతుఁడు లలాటమున అదే లిఖించినయెడల మహారాజుగారి కొఱకు హృదయ శోణితమును విడుచుటకంటె రాజపుత్రునకు ఎక్కువ కార్య మేముండునో నే నెఱుఁగను."

అందఱు కొంచెముతడవు నిశ్శబ్దముగా నుండిరి అనంతరము నరేంద్రుఁడు తనహస్తము చూపి, "నిజముగా నీకు సాముద్రికము తెలిసిన పక్షమునఁ గడచినరాత్రి నే నెచ్చట నుంటినో, యెవరిని జూచితినో చెప్పు, చూతము!" అనెను.

తాత్తారుఁడు చాలసేపూరకుండి, నేలవంకఁ జూచి, తుదకు నెమ్మదిగా నరేంద్రునివైపునకుఁ దిరిగి, "యువన్, ఒకానొక ముసల్మానీ నీప్రియురాలు; గడచినరేయి నీవామెను జూచియుంటివి," అని చెప్పెను.

గజపతిసింగు నవ్వెను, అందఱు నవ్విరి.

నరేంద్రుఁడు నవ్వలేదు. తాత్తారునిమాటల నాలకించి యులికిపడి, యాశ్చర్యముచే నూరకుండెను.

ఇంకొకతడవునకు తాత్తారుఁడు నరేంద్రు నొకప్రక్కకుఁ బిలిచి, యిట్లు చెప్పెను. "యువన్, ఢిల్లీనగరమున నున్న పక్షమున నీకు చాలవిపత్తుగలదు. ఈనగరమును విడిచి నేఁడే పరుగిడుము. నీస్నేహితునితో నర్మదాతీరమునకుఁ బొమ్ము. ఈపిచ్చివాఁడును అటేపోవుచున్నాఁడు; అంగీకరింతువేని నీ వెంట వచ్చును. పిచ్చివాఁడు నీకపకారము చేయఁడు; ఆపదల నుండి రక్షించుటకు ప్రయత్నించును."

నరేంద్రనాథుఁ డింకను ఆశ్చర్య మొందెను. ఈబాలుఁ డెవ్వఁడు? ఈచిన్నవాఁడు భూతభవిష్యద్వర్తమానములను జెప్పఁగలఁడా? కడచిన రాత్రికథ నతఁడు నిజముగా నెఱుఁగునా? పిచ్చివాఁడే యయినను నరేంద్రుని హితైషి; ఆపదల నుండి తప్పించినను తప్పించవచ్చును. ఆలోచించి, వానిని తన దగ్గఱ నుంచికొనుటకు నరేంద్రుఁ డంగీకరించెను.

ఆనాఁటి సాయంసమయముననే గజపతి

నరేంద్రుఁడు, తాత్తారబాలుఁడును దక్షిణనగరమును విడిచి, నర్మదాభిముఖులై చనిరి.

## ౧౫

క్రీ. ౧౬౫౮ వ సంవత్సరము వసంతకాలమున ప్రాచీనోజ్జయినీ నగరము, సిప్రానదియు నూతనశోభను దాల్చినవి. చంద్రుఁడుదయించెను; వెన్నెలలో మాపుమీఁద సిప్రానదికి రెండువైపులను తెల్లనిగుడారములు కానఁబడుచుండెను. ఒకవైపు జస్వంతసింగు, ఆయన సహయోధ శాశింఖాన్ యొక్కయు సేనలు చంద్రికిరణోజ్జ్వల శిబిరశ్రేణియందు విశ్రమించుచుండెను; రెండవతీరమున నొక పర్వతముమీఁద ఔరంగజేబు మురాదుల మొగలుసైన్యము విడిసియుండెను. నడుమ సిప్రానది కలకల నినాదముతో శిలాశయ్యమీఁదుగాఁ బ్రవహించుచు, రాజపుత్రుల యొక్కయు మొగలులయొక్కయు యుద్ధసన్నాహము చూచి భీతి నొందక నవ్వుచుఁబోవుచున్నట్లుండెను. భారతవర్షమునకు కటిబంధము వంటి వింధ్యపర్వతశ్రేణి వెన్నెలలో దూరముగాఁ గానవచ్చుచుండెను. మఱునాఁడు భీషణయుద్ధము జరుగనున్నను నేఁడు లోకమంతయు సుషుప్తి యందున్నది రక్షకభటుల కేకలు నడుమనడుమ వినఁబడుచుండెను. సిప్రానదీ తరంగమాలిక కలకల నినాదము చేయుచుండెను. దూరమున నక్కకూఁతలు నదీకూలమునను పర్వతశ్రేణియందును ప్రతిధ్వనితము లగుచుండెను.

నరేంద్రుఁ డొక గుడారమున నిద్రించుచుండెను, అయినను నానావిధయుద్ధ చింతలు స్వప్నరూపమున నాతని మానసమున మెలఁగఁ జొచ్చెను. వానితోపాటు వెనుకటి వృత్తాంతములు స్ఫురించుచుండెను. సిప్రానదీ కలకలధ్వని భాగీరథీశబ్దమువలెఁ దోఁచెను. గంగాసమీపమున ఆరామపరివేష్టిత మైన యున్నత హర్మ్యము కానఁబడెను తీరమున నిసుకలో బాలురిరువు రాటలాడుచుండిరి. బాలిక యొకతె నిలువఁబడి సంగీతము పాడుచున్నట్లుండెను. ఆ యనురాగమూర్తి యెవ్వరు? ఆమె యెక్కడిది? భాగీరథీతీరమునందలి వనమున నాముప్వురు చీఁకటివేళ నాటలాడుట సత్యమే; కాని కాలనిష్ఠురగతిచే నాచిత్తరువు నశించిపోయినది!

స్వప్నము మార్పునొందెను. భాగీరథీకల్లోలము లేదు; రమణీగీతధ్వని ఈమె! రమణియా? అచ్చరయా? పెద్దమేడ లోకప్పు స్తంభములు బంగారు వెండి రంగుగా నున్నవి; నడుము నొక యప్సరస గానము చేయుచున్నది. అది విషాదగీతము. జలేఖా కన్నీరు విడుచుచు విషాదగీతము పాడుచున్నది. అదిగో, జలేఖా నిలువబడియున్నది; రత్నవిభూషిత కేశపాశముచే వదనము దలమించుక యావృతమైనది; అదిగో, తదీయ జాజ్వల్యమాన నయనద్వయమునుండి బాష్పకణము రాలుచున్నది!

స్వప్నము మాఱిపోయెను. జలేఖా కాదు, తాత్తారబాలుఁడు గీతమును పాడుచున్నాఁడు. ప్రేమించి, ప్రేమకు బదులెఱుఁగక, పిచ్చివాఁడై దేశదేశములుతిరుగుచున్న వాని గీతమిది గానముకలన నరేంద్రునకు నిద్రాభంగమాయెను; అంతనతఁడు పటకుటీరమునుండి యీవలకు వచ్చెను. లోకము శాంతముగ నుండెను; అర్ధరాత్రమున వాయువు మందముగా వీచుచుండెను; వెన్నెలలో నదీపర్వతశిబిరములు దృగ్గోచర మగుచుండెను. నిర్భాగ్యుఁడు తాత్తారబాలుఁడు డేరా వాకిటఁ గూరుచుండి, యుచ్చైస్స్వరమున పాడుచుండెను. సప్తస్వరమిళితమైన యాగానము వాయుమిళితమై, యాకాశము నధిరోహించి, నల్వంకల వ్యాపించుచుండెను.

నరేంద్రుఁడు సాశ్రునయనుఁడై బాలుని కేలు పట్టుకొని, కన్నీరు దుడుచుకొని, యిట్లనెను: “నీవు నిజముగా ప్రేమ తోనే పిచ్చివాఁడ వయితివా? నీహృదయమున నేదయిన నింక దుఃఖమున్నదా? ఉన్నచో నాకుఁ జెప్పుము; నేను నీ కష్టమును పంచుకొందును. మనస్సు విప్పి, అన్ని సంగతులు నాయెదుటఁ జెప్పుము.”

బాలుఁడు తదేకదృష్టితో నరేంద్రునివైపు చూడసాగెను; శరీరము కంప మొందఁ జొచ్చెను కొంచెముసేపటి కతఁడు హృదయోద్వేగము నణఁచుకొని, కరుణాస్వరమున మెల్లగా నిట్లు పలికెను: “క్షమింపుఁడు, నేను వెఱ్ఱివాఁడను; నోటికివచ్చినదెల్ల పాడుచుందును.” నరేంద్రుఁ డనేక ప్రబోధవాక్యముల నుపయోగించి, మాటిమాటి కాతని దుఃఖకారణమును, అంత చిన్నతనమున నే ఫకీ రగుటకు హేతువును అడిగెను. బాలుఁ

డు తగిన సమాధానము చెప్పక, ‘‘నేను దిగా నాను!’’ అని మాత్రము చెప్పెను.

తెల్లవాఱుజామున నరేంద్రుఁడు సైనికవేష ము ధరించి, తన మిత్రుఁడు గజపతిసింగు డేరా కుఁ జని చూడఁగా నతఁడు సైనికకార్యములు నిర్వర్తించుచుండెను. ఖడ్గమును, బల్లెమును తానే నూఱుచుండెను. శస్త్రములు వెండివలె తళతళ లాడుచున్నను గజపతి యింకను పదను పెట్టు చుండెను. చూచి నరేంద్రుఁ డచ్చెరువొందె, గజ పతి శయ్యవైపు చూచెను. అతఁడు రాత్రి నిద్రిం పలేదు—శయనియే చేయుచుండెను అతని ముఖ ము పాలిపోయెను, కన్నులు నీలిపు దాల్చెను. ఏల? కొన్నిరోజులనుండి చూచుచున్న నరేం ద్రుఁడు గజపతియొక్క మార్పులకు కొంచెము కొంచెముగా కారణము గ్రహింపఁగలిగెను. ఉన్మ త్తతార్తారబాలుఁడు చేయి చూచినది మొదలు తాను ఉజ్జయినీయుద్ధమున మృతినొందునట్లు గజ పతిసింగు దృఢముగా నమ్మెను; కడచినరేయి ని ద్రింపక మరణమునకు సంసిద్ధుఁ డగుచుండెఁ బోలును!

గజపతిసింగు భీరువని తలఁపకుము రాజపు త్రులందఱు సాహసులు; అందులో తేజసింగు పుత్రుఁడు గజపతిసింగు కంటె నెక్కువసాహసి యెవ్వఁడు లేఁడు. అయినను, మఱునాఁడు మర ణము దృఢ మని తెలిసినచో ధైర్యశాలి హృద యము గూడ చింతారేఖాంకితమగును. యోధులు యౌవన మదోన్మత్తులై, జీవనసుఖమున మునిఁగి యుండి, రణోత్సాహముచే ప్రఫుల్లహృదయులై, జయాశచే నూరడిల్లి, మరణచింత యెఱుఁగరు. అట్టి వారికి యుద్ధము సంతోషకరమే. ఆ నేరులు మృతి నొందుచున్నారు, వారుగూడ నెప్పుడో యొకనాఁడు మరణింతురు; అందు విచారమేమి? కాని ‘రేపు మరణము’ అను పిడుగువంటి మాట లాకస్మికముగా హృదయమునఁ దగిలినచో నుత్సాహవికాసము లడుగంటును. ఆకాలపు జనుల కందఱకువలె గజపతిసింగునకు జ్యోతిష మున నమ్మకము మెండు. కావున, మరణము తప్పదని గట్టిగా నమ్మి, రేయి నిద్రపోవక యతఁ డు చావునకు సంసిద్ధుఁడయ్యెను. ఆయుధములు బాగుచేయుట కాలయాపనమున కుపాయము. నరేంద్రుఁడు వచ్చినంతనే గజపతిసింగు లేచి, యాతనిచేయి పట్టుకొని, మందహాసముతో,

‘‘ఆయుధములు పరిశుభ్రమయినవో లేదో యని చూచుచున్నాను,’’ అని పలికెను.

‘‘నిజముగా మీరు యుద్ధమున పోవుదురా? పిచ్చిఫకీరు మాటలు జ్ఞాపకము చేసికొను చున్నారా?’’

‘‘ఎదుట యుద్ధము పెట్టుకొని రాజపుత్రుఁ డెన్నఁడును వెనుదిరిగి చూడఁడు. నాతండ్రి తేజ సింగుగారు నాకిట్లు నేర్పినారు. నరేంద్రా, ఒక్క యుద్ధమున నేను జస్వంతసింగు మహారాజుగారి కొక యుపకారము చేసినాను; వారు సంతో షించి నాకీ ముత్తెపుహారము నొసఁగినారు. అప్పటినుండి అన్ని యుద్ధములలో ఈహారము వేసి కొనుచున్నాను. నేఁటియుద్ధమున నీవు కుశలము గా నుందువేని మహారాజుగారి కీహారము సమ ర్పించి, దేశములో నాశిశువు లిద్దఱున్నారనియు, తల్లిలేదనియు, ప్రభువుగారు వారియెడ కృపా దృష్టిని ప్రసారింపవలెననియు, విన్నవింపుము. బాలుఁడు రఘునాథుఁడు తండ్రివలెనే ప్రభువు నకై చొప్పున రణరంగమున జీవితము విడువ సమర్థుఁడగుఁగాక; ఇంతకంటె నెక్కువశుభము వాని తండ్రి తలఁపోయఁ డనియును మనవి చేయుము!’’

నరేంద్రుఁడు నిశ్శబ్దముగా నుండెను; అతని కటిసంటి బాష్పకణము రాలెను. గజపతి నేత్ర ములు ప్రకాశమానముగ నిర్మలముగ నుండెను.

చప్పున భేరీభాంకారము వినవచ్చెను. ఔరంగ జేబు స్ప్రిప్రా నదిని దాటుటకయి యత్నించుచుం డెను. గజపతి యుద్ధవేషము దాల్చి, వెలుపలికి వచ్చి, చటుక్కున గుఱ్ఱమెక్కి, శరవేగమున నదివైపునకుఁ బరుగెత్తెను.

నరేంద్రుఁడుం బయటికిఁ జనుదెంచి, యుద్ధ రంగాభిముఖుఁడుగాఁ జనెను.

౧౬

ఔరంగజేబు మురాదు శిబిరము చేరి, మురా దుకొరకు వేచియుండెను. రెండుమూఁడు రోజు లయినతరువాత మురాదు తనసేనతో ఔరంగ జేబును గలిసెను. ఈరెండుమూఁడు రోజులలో జస్వంతసింగు ఔరంగజేబు - నాక్రమించిన పక్షమున నాతఁడోడిపోయెడివాఁడే. ఔరంగ జేబునకు కొద్దిసైన్యమే యుండెనని తెలియకుం డుటచే జస్వంతసింగు యుద్ధము నుపక్రమింప

లేదని కొందఱు చరిత్రకారు లనుచున్నారు; ఉదారహృదయుఁ డగు రాజపుత్రసేనాని యీ సంగతి నెఱింగియు, అల్పసేనతో యుద్ధము చేయుట ధర్మము కాదని యూర కున్నట్లు మఱి కొందఱు చెప్పెదరు.

నేఁడు సోదరు లిరువురు కలిసినారు. రేపు యుద్ధము జరుగును, అని జయజయ ధ్వనితో శిబిరము నిండిపోయెను. పట్టువస్త్రాలంకృతము, దీపశ్రేణి మండితము నగు పటకుటీరమున సహోదరులిద్దఱు భోజనమునకుఁ గూరుచుండిరి. లోకమును మోహింపఁజేయు నాటకత్తెలు, పాటకత్తెలు నృత్యగీతాదులతో పాదుషాకుమారుల మానసములను సంతోషపెట్టుచుండిరి. మురాదు ఫాలమున్నతము, వక్షము విశాలము, ఆకారము పరాక్రమ సూచకము, హృదయము నిష్కపటము; ఔరంగ్‌జేబు లలాటము కుంచితము, దృష్టి తీక్ష్ణము, మానసము సర్వదా బహుచింతా సంకులము: అయినను, ఔరంగ్‌జేబు ఎంతసరళముగా, ఎంతమనోహరముగా మందహాసము చేయుచున్నాఁడు! ఎంత గౌరవపూర్వకముగా మురాదుతో సంభాషించుచుండెను. అన్నగారిని జూచి యానందము పట్టఁజాల కున్నట్లును, అన్నగారి పని సాధించుటకంటె లోకమున నతనికి వేఱొక యభిప్రాయముగాని, సంతోషముగాని లేనట్లును గానఁబడుచుండెను.

భోజన మయ్యెను. సేవకులు ఫలములు, మద్యములు దెచ్చిరి. పాటకత్తెలు మరల గానమారంభించిరి. శిబిర మానందముతో నిండెను. కేశములందలి మణులతో పాటు కటాక్షములు కలిసిపోవ సాగెను; లలితగానముతో మధురహాసము కలియఁ జొచ్చెను. మురాదు సంపూర్ణముగా ముగ్ధుఁడయ్యెను. తుదకు, ఔరంగ్‌జేబు సంజ్ఞచే నట్టువకత్తెలు వెడలి పోయిరి.

సువర్ణపాత్రములో మద్యము పోసి ఔరంగ్‌జేబు మురాదుచేతి కిచ్చి, "ఈ కృపచే మిమ్ము సంతుష్టిపఱచితిని; నేఁడు నాజీవితము సార్థకమయినది!" అని పలికెను.

"ఔరంగ్‌జేబ్, నీవంటి నిష్కపట సోదరుఁడు దొరకఁడు. కొంచెము మదం తీసికొమ్ము"

"క్షమింపుఁడు, నాజీవితమున సుఖవాంఛ లేదని మీ రెఱుఁగుదురు. మీవంటి పరాక్రమశాలిని పితృసింహాసనముపై సందర్శింపవలెనని కోరిక గలదు. ఇంతకంటె మఱే వాంఛయు లేదు. ఈయుద్దేశమును పైగంబరు సఫలముచేయునేని సంతుష్టచిత్తముతో ఫకీరునై మక్కాకు యాత్రచేసెదను," అని పలికి ఔరంగ్‌జేబు మఱియొక మదిరాపాత్ర మాతని కిచ్చెను.

"మఱి యెవరికోసము ప్రయత్నము చేయుదును? తైమూరు సింహాసనము నధిరోహించుట కెవఁడు దగినవాఁ డెవ్వఁడు? సుజా విలాసప్రియుఁడు, భీరువు. సుజా తైమూరుసింహాసనమును కలంకము చేయవలసినదేనా! మురభిమాని, మూర్ఖుఁడు, కాఫరు దారా తైమూరు సింహాసనమును కలంకము చేయవలసినదేనా? అంతకంటె హిందూస్థానము మరల కాఫరులకు వశ మగుఁగాక! తైమూరు పేరు లేకుండఁ బోవుగాక! వీరికోసము నేను యుద్ధము చేయను. ఎవరిసాహస మపారమో, యెవరి యశోరాశి భారతవర్షమున నిండియున్నదో, ఎవరు మొగలుసామ్రాజ్యమున కాధారులో, ఎవరు మొగలువంశతిలకులో యట్టివారికై యుద్ధము చేయుదును. నేను మీ సన్నిధిని మీకీర్తి నుగ్గడింపఁ గోరను; కాని మిమ్ము విలోకించి నప్పుడు యథార్థముగా మీవిశాలఫాలమున 'బాదుషాహా' యను నక్షరములు కానఁబడినట్లు తోఁచును. ఇట్టిమహావీరుని కార్యసాధన తత్పరుఁడ నగుటచే నాజీవితము ధన్యమైనది!" అని యుపన్యసించి ఔరంగజేబు మరియొకసారి సువర్ణపాత్రమును మద్యముతో నింపెను.

"ఔరంగ్‌జేబ్, నీవాక్యములకు నేనునిశ్చయముగా సంతుష్టుఁడనైతిని. రేపు యుద్ధము జరుగును; సైన్యములన్నియు సిద్ధముగానున్నవా?"

"నేను మూఁడు నాలుగు రోజులనుండి యుద్ధసన్నద్ధుఁడనై యుంటిని. కాని, రణనీతియందు నేనింకను పరిపూర్ణత నొందలేదు; ఒంటిగా సాహసము లేదు. మీరు సమీపమున నున్నచో పర్వతపార్శ్వమున భద్రముగా నున్నట్లు తోఁచును, నాసాహసము ద్విగుణిత మగును!"

అలీక స్తోత్రపాఠములు సత్యమని నమ్మునంతటి యాత్మాభిమాని మురాదు; విశేషించి యిప్పుడు మదిరాసేవచే వివేకము గోల్పోయెను. ఔరంగ్‌జేబు పలికిన ప్రశంసా వాక్యములకు సంతుష్టుఁడై మురాదు ఇట్లనెను: "భాయీ, నీవు కూడ క్రమముగా రణకోవిదుఁడ వగుదువు. ఇప్పుడు కొన్నిరోజులు నాపై నాధారపడియుండుము, నేనో, నేను లోకమున నెవరి

మీఁదను ఆధారపడను; నాపరాక్రమమును, ఈఖడ్గమును కేవలము నమ్మియుందును!" ఇట్లు పలికి యతఁడు ఒరనుండి కరవాలమును బెఱికెను. దీపకాంతిలో ఖడ్గము తళతళ లాడెను. మరల తరవారి కోశమున నుంచఁ బోవఁగా నమిత మదిరా పానముచే దృష్టి యవశమై, కత్తి నేలపైఁ బడెను ఔరంగజేబు నవ్వు నాపుకొని, యింకొక గిన్నెఁడు మద్య మొసఁగఁగా మురదు దానిని నిశ్శేషముగాఁ ద్రాగివేసెను.

"భాయీ, ఇఁక సెలవు! యుద్ధ క్షేత్రమున తిరుగ మీదర్శనము చేసెదను," అని ఔరంగజేబు చెప్పెను.

"పో, ఔరంగజేబ్, పో! నాకు నీయెడ మిక్కిలి సంతోషము కలిగినది. రా, కౌఁగలించుకొందును!" అని మురాదు ఆలింగనార్థము లేచెను; కాని యధిక మద్యపాయి యగుటచే నేలపైఁ బడెను.

అంతట ఔరంగజేబు ముఖభంగి మార్పు నొందెను; అన్నగారిని మందహాసముతోఁ జూచిన వదనము మాఱిపోయెను. ముఖము గాంభీర్యము వహించెను లలాటమున రెండు మూఁడు రేఖలు కానవచ్చెను. నిశ్శబ్దముగా నతఁడు డేరాలో నిటు నటు నడువఁ జొచ్చెను; నడుమ నడుమ తటాలున ఎదుట నేదో పదార్థ మున్నట్లు స్థిర దృష్టితోఁ జూచుచు మరల పచారు చేయుచుండెను. ఒకొక్కసారి ముఖమున దరహాసము కానఁబడును; ఇంకొకసారి కఠోర భావము వ్యక్తమగును, లలాటము కుంచితమగును.

ఒకసారి యతఁడు నిశ్చలముగా నుండి, స్థిర దృష్టితో నొకవంకఁ జూచుచు, అస్ఫుట వాక్కులతో నిట్లను కొనెను: "ఉజ్జ్వలమణిమయ కిరీటము, మయూర సింహాసనము, ప్రశస్త భారత వర్షమును జనకుని దుర్బల హస్తమునుండి స్ఖలిత మగుచున్నవి. ఎవరు గ్రహింతురు? దారా, భద్రము! నీకు బలమున్నది, సాహసమున్నది; అయినను నేను దుర్బల హస్తముతో కత్తి పట్టలేదు. క్రోధ వికృతము; కానిచో ఖడ్గ హస్తుఁడనై మార్గము పరిష్కరించెదను. నీవు ఆత్మాభిమానివి, గర్వివి; కాని, నీగుణముల కంటె కఠోరతర దర్పము, దృఢతర వ్రతము దరహాసవదనమున డాఁగి యుండవచ్చును.

మురాద్, నీవు పరాక్రమ శాలివి! సింహాసనముపైఁ గూరుచుండెదవా? సూకరము బురదలో వలె నీవు నేలమీఁద దొరలినా వేమి? అడవి పందికిని నీకువలె సాహసమున్నది. పశువా రేపు యుద్ధమనఁగా నేఁడు విలాస విహ్వలుఁడవై యుంటి వేమి? అవసర మున్నంతకాలము నీద్వారా నాకార్యము నెరవేర్చి కొందును; తరువాత నిన్ను దూరముగాఁ దన్ని వైచెదను. రేపు యుద్ధము; లలాట రేఖ యెట్లున్నదో! పితృ హస్తమునుండి రాజదండము లాగివేయ నుద్యుక్తుఁడ నైతిని; భ్రాతృ రక్తముతో దేశము ముంచివేయ సంసిద్ధుఁడ నైతిని; భీష ణోద్యమ ప్రవృత్తుఁడ నయితిని; చాలదూరము ముందుకు వచ్చినాను; ఇఁక వెనుదిరుగుట కుపాయము లేదు. ఖడ్గ హస్తుఁడనై కంటకమయమైన మార్గము పరిష్కరింతును; అవసర మయినచో ఉజ్జయిని మొదలు ఆగ్రావఱకును మార్గము మానవరక్తరంజితమును కావింతును; ఈఘోర ప్రతిజ్ఞ చలింపదు. తైమూర్ తాతా, నీకిరీటముతో నాలలాటమును శోభిల్లఁ జేయుదును! కానిచో రేపు నాహృదయ శోణితముతో సిప్రానదీజలము శోణ మయిపోవును!

౧౭

క్రీ. ౧౬౫౮ వ సంవత్సరమున వైశాఖమాసమందు ఘోరయుద్ధము జరిగెను. మురాదు ఔరంగజేబుల సేనలు సిప్రానదిని దాట యత్నించుచుండెను, కాని అది సులభ కార్యము గాదు. సేన నదిని దాటుటకు ఔరంగజేబు చాల నిపుణమైన యేర్పాటు చేసెను. ఉన్నతస్థానమున ఫిరంగులు నెలకొల్పి, శత్రులరాక నరికట్టుచు, తనసైన్యము నది దాట వలెనని యతఁ డాజ్ఞయిచ్చెను. వైరుల ఫిరంగులుకూడ బారు తీఱియుండెను; వారును ఔరంగజేబుభటులను నది దాటకుండఁ జేయుచుండిరి. తుముల యుద్ధము చాలవఱకు జరుగ సాగెను జస్వంతసింగు మహాపరాక్రమముచూపి మొగలుల మార్గమును నిరోధింపఁ జొచ్చెను; కాని ఆయనతోడి సేనాపతి కాసింఖాన్ అట్టిప్రయత్నము చేయలేదు. అతఁ డౌరంగజేబు ధనమునకు వశుఁడై తన మందుగుండుసామానులు దాచుటచే త్వరలోనే అతనిఫిరంగులు నిశ్శబ్దములయ్యెనని యాకాలపుఁ జరిత్రకారులు సందేహించుచున్నారు. ఈయవస్థలో శత్రుల ఫిరంగులయొదు

ట యుద్ధము చేయుట జస్వంతసింగున కసాధ్య మయ్యెను; కాని, ప్రయత్నము చెడినను అతి లోకపరాక్రమము చూపి, వైరిమార్గము నిరోధించుచుండెను. అది పర్వతమయప్రదేశము. కావున విరోధులు సులభముగా నదిని దాట లేక పోయిరి. అయినను, సాహసియగు మురాదు కతిపయసేనా సహితుండై సకల నిరోధముల నతిక్రమించి, జయనినాదముతో రెండవతీరము చేరెను. దానిం గాంచి, తక్కిన బలములుకూడ ఆవలియొడ్డు చేరెను. భీరువు కాసింఖాన్ వెంటనే తనసైన్యముతో పలాయనము చేసెను. కాబట్టి, జస్వంతసింగునకు మేరలేని చిక్కు సంభవించెను. నల్వంకల రిపులు ముట్టడించినను అద్వితీయ పరాక్రమశాలియగు రాజపుత్రసేనాపతి యుద్ధము చేయ సాగెను. ఆ ఘనసేన క్రమక్రమముగా క్షీణించ సాగెను, ప్రియానుచరులు నలువంకల నిహతులగుచుండిరి. మొగలుల జయధ్వానముతో భూమ్యాకాశములు దద్దరిల్ల సాగెను. చాలసేపు యుద్ధము జరిగిన తరువాత పరాజితుండై జస్వంతసింగు కేవల మయిదువందలమంది భటులతో యుద్ధక్షేత్రము విడిచెను. ఏడు వేలమంది రాజపుత్రులానాడు ఆభయంకర రణభూమియందు ప్రాణములు విడిచిరి.

(పూర్తికాలేదు)

# శకుంతలలేఖ

శ్రీ. వీరరాఘవస్వామి

[బాంగ్లాభాషలో మహాకవి మధుసూదనదత్తు రచించిన వీరాంగనా కావ్యములోని మొదటి సర్గ కాంధ్రము]

వననివాసిని యగుదాసి వందనములు
సలుపుచున్నది రారాజు చరణములకు!
నృపతిచంద్రమ, మీరె పరిత్యజింప
నెవ్వరీవిను రాదీ బాలించువారు?

మతివిహీనత, నాశాప్రమాదమునను
అక్కటక్కట ! యున్మత్తనైతి నేను.
అంబరమ్మునంటు వాసుపుంజంబుజూచి
దవ్వుటడవిని మారుతధ్వానమువిని
సైంధవంబులు రథములు, సారథులును
కాల్బలము, కింకరులు వెంటగదలినదువ
రత్నభూషితమగు శరీరంబుతోడ
నాశ్రమమునకు మీర లేయరుగుదెంచు
మన్నవారని తలచితిని పులికిపడుచు.
'చూడుము ప్రియంవదా,
అనసూయ, చూడు
మిన్ని నాళ్ళకు నేడు ప్రాణేశ్వరునకు
తనయందుదాసి జ్ఞప్తికిదగిలె నహాహా!
కనుఁడ దేశధూళి పర్వె నాకసమువంక,
అదిగొ కోలాహలములు వీనులలర వినుఁడు!
ఎందఱో పురజనులు ప్రాణేశునాజ్ఞ
నన్నుఁగొనిపోవ వచ్చుచున్నార లిటకు
అనుచు సఖులను బిలిచి నే నంటినిట్లు
ఆసమోహ మొనగ్గూట నరయలేక.
సఖిప్రియంవద యేమ్మైని స్తబ్ధయగుచు,
ఆలి అనసూయ వగచె నిరాశయగుచు.

మంచు నీపాదయుగళికి మొక్కి యంత
శీఘ్రము నికుంజవనమును జేరియచట,
వ్యగ్రభావముతోడ దిశాళిఁ గాంచు
సరళవల్లుల వికచపుష్పములఁగాంచి
మధుపఝంకృతి పరభృతమధురకృతి

నదరవము శుష్కపర్ణనినాదము విని
కోటరంబుల శాఖలఁ గూరుచుండి
ముక్కుముక్కునఁ గీలించి ముక్కవగను
ప్రణయ కూజితములఁ బల్కు పావుర
ములఁ
గాంచి యిట్లంటి కోపాన కాంత, నేను:
'ప్రసవయుత కుంజమా, యేల
ప్రహసనంబు?
నీపరిమళ మాధుర్య మేపుమీఱ
పాఱఁజల్లించెదేల సమీరుచేత?
'ఓ వనప్రియకులపతీ, యీవనమున
ఈవిరానందకాల మందిట్లు నేఁడు
సమ్మదస్వరలహరీ ప్రసారణంబు
చేయుచున్నా వదేల విశేషముగను?
మన్మథానుజీవుం డలమాధవుండు,
(మాధవుఁడు మీఁద ప్రేమను
మన్మథునకు)
ఆవసంతుని భృత్యుఁడవైన నీవు
ప్రభువు లేనప్పుడేల స ఖగముతోడ
గాన మొనరించుచున్నావు గంతమెత్తి?

'భృంగఝుంకార మిషఁగూడ పిపిన దేవి,
దుఃఖనీదుఃఖమునకై మృదుస్వరమున
నిట్లు రోదించుచుంటివా యేమి నీవు?
'హ్రదినీరవమిషచే నరణ్యదేవ,
నృమణి గంభీరరవమున నిందచేయు
చుంటివా? మేను కంపించుచున్నదయ్య
ఆగ్రహమున శపింతువో యనుభయమున!

'పత్రిమా, నీదుసరసభావం బెఱింగి
నూర్మిమై నాటలం దేర్పి కొనుచు నిచ్చ
మింటికై కొనిపోవు సమీరణుండు;
కావున నీ వెండినప్పుడు కరముదప్ప
ఎగఁగొట్టును గాదె ని న్నేవగించి?

అటుల నీదాసి విడనాడ నగునె నాథ!
ఆశ్రమపదమునఁ గూర్చుండి
యక్షియుగము
మూతవడి నాథ మీపదాంభో
రుహములఁ
ద్వరితముగ పొందఁగలనని తలఁచినాను
భ్రాంతివశమున తెలియక ప్రాణనాథ!

మీ పదధ్వని విన్నట్లు తోప నంత
నెడద దడదడమనుచుఁ గంపింపఁదొడఁగె
చక్షు లుల్లాసమున వికస్వరము లయ్యె
అంత సారంగిఁ గంటి, మహార్తి నొంది
తిట్టి తిరిమికి దాని చే దెబ్బకొట్టి.

బిగ్గరగఁ బిల్చి పల్కితి భృంగపతికి:
'సూనమిత్ర, శిలీముఖ జుమ్మటంచు
వచ్చెదవయేని పురుకుతేశ్వరుఁడొసంగు
త్వరగ నీదాసి రక్షింప దర్శనంబు.

కాని పిల్చితి నిరుపయోగముగ నాథ!
ఇంక మధులోభి గోలంబ మీముఖంబు
నరయఁ బరుగెత్తివచ్చు నేయాసకలిమి?
ఎండునెడ పూవు నెవ రాదరించువారు!

వందురుచు నాలతామండపాంతరంబు
చేరియుంటిని నాథ యోజించి చూడఁ
డెచటనో జ్ఞాపకం బున్న నృపవరేణ్య!
తోయజ దళానప్రేమ కౌతూహలమున
నెచటఁ గూర్చుండి యీదురదృష్టురాలు
వ్రాసెనో గీతి మీరు సత్వరము వచ్చి
అసమ విరహార్చి నెచట చల్లార్చినారొ?
ఎచట నేమేమి యేరీతి నెన్ని యెన్ని
నలినదళములు గొని వ్రాసినానొ నాథ

'రాజసౌధమునందు భద్రాసనమున

వెల్లు రాజిల్లునుండి రాట్టల్లజ్జుడు
అనిల కులపతి, నాలేఖ న దిపోయి
ఆనృపేశ్రు గుని పాదాంబుజాళి నుంచు!'
మనుమి వచియుంచు నుంటి నిరంతరంబు
కృతక రాంజలినై మగత్పతిని బిల్చి.

'కృష్ణసార నుదిష్ట పూర్తికి ప ధాత
నిన్ను జూపించె పాణేసు డున యెడకు
శీఘ్రగతి నాదు లేఖ దీసికొని పొమ్ము!
శోద్ధతో నిన్ను బెంచితి శైశవమున
అకట విరహా గనే వృత్తి సాహాయ ద
నేను కృప జీర్ణ జీవనుల్ పిలుహ లేవె?'
అనుచు శూన్యమనస్సునై యనుదినంబు
హరిణముగ బిల్చి యాశీర్ధ నను నుంటి

ఇంక నేపను లేవేట యెవరి కెవరి
కేవనించితినో విచారించి చూడ
డోన గేశ్వర, జ్ఞాపక వ ంచు నేట! [ను
అలియనసూయ, సఖియు ప్రియంవదయు
తప్ప నీజనహీన కాంతారమందు
నిట్టిదౌర్భాగ్యురాలి దుఃఖేతి హాస
మకట తెలిసినవారు వే రన్యు లెవరు!
వారలిద్దరు చెంతకు వచ్చియున్న
తరిని నేనెప్పటట్లు నేత్రములు మూయ
నన్ను వివశగ మాని కన్యలు గ్రహించి
శోషమున మిమ్ము నిందించి రోష్ప పేంద్ర

అల్పకధ చెప్పుచుంటి శూన్యంపుటెదను
వజ్రి సదృశాప వాదము ధ్వని యొనర్చె
బిద్ద లయ్యెను లోని శోషమ్మువలన
నాదుహృదయంబు! పల్కులు నాధ,
రావు!

వేడ్చియేడ్చి భ్రమించితి నింక నెన్ని
స్థలము లుండెనో యాప్రదేశంబు లెల్ల
వెతకుచు చెంత గాంధర్వ్వైగవమున
మోస మొనరించినారో యీ నాసి నట్లు

వేనికై జాబియమున బ్రినూనగల్ప
… మీ పాదములను సేవించె దాసి,
ఆయరణ్యపు శయ్యా గృహాన దాని
కేలియయాహాయు మది నద్భవించియుండె,
తాం బ నేశించె నాకుంజదాము మెపుడు
నూనసుంగో నెంచి కనుడు ధీమంత మీరు

హా విధీ, యున్న దిదియె నీభావమందు?
ఈఫలము పండెనే పేదు వృక్షశాఖ?
తిరిగితిని నిత్యమీగతి దిక్కులేక! [న
భాగ్యమునవృద్ధయును బితృవ్వసయునై
గౌతమీతాపస్విని పాణికాంత, నాదు
చిత్తము, ద … బలాన … జించియుండె
ఆమెయే లేకయున్న యధార్థముగను
సర్వనాశన మెప్పుడో జరిగియుండు !
కుసుమరత్నములను గూర్చి
కుసుములుముడువ
నాస లేదింక దేవ, లేదన్నరుచియు !
అక్కటా, శూన్యమానస నాట నిట్టు
లెవరికేమి వచించితో యెఱుక లేదు.

వ్యధను నిట్టూర్చి ధారుణిపైన దొరలి
అనిశమును దెల్వితప్పి, చేతనము నంద
కనులు తెఱచితి మీ సమ్ముఖంబు గంటి
కరములప్పుడె చూచి మీచరణయుగము
బట్టుకొన నెంచితిగాని పడయ లేక
వ్యధను బొందితి హాహారవమ్ముతోడ
ఎవ్వరే పాపమున నెప్పుడింత మోస
మోర్చియుండిరి వేయఘంబో విధాత,
యిట్లువ్యధముం చెవెవరిబ్రశ్నింపవలెన్ను
ఆ విరామప్రదాయిని యైన నిద్ర
తావొసంగిన తన మృదూత్సంగమందు

నేకలలఁ గాంచియుందునో యెఱుగు
కెట్లు?
కనకమణి ఘట్టితాట్టాలక వ్రజంబు
దంత నిర్మిత ద్వారస్థ దంతావళముల
మధ్యమధ్యస్థ భర్మ సింహాసనముల
సూనశయ్యా తలంబులఁ జూచియుందు
నిక్కృత విద్యాధరాంగనా నివహాలైన
కింకరీ జనులందు సంగీతములను
బాడువారిని నాట్యంబు లాడువారి
వివిధభూషణములు పేర్చి వేచువారి
రాట్సుఖాదేయులైన వారలను జూతు.

రత్నములు ముత్యములు
రాశిరాసులుగను
శ్రీదపురమందుఁబోలె వీక్షించియుందు
ఆలకించియె యుందు వీణారవంబు
నందనమున వసంత మానంద సనుచు
పితరులో కణ్వులు వచింప వింటి నాథ
నామనంబు మీసన్నిధానంబునందు
నందన వనాంతర వసంతమందుఁ బోలెఁ
బరిమళామోదమునఁ బారవశ్యమొందు
హస్తమున దివ్య మణి భూషణాళి
వెలుఁగ
రాజదండంబు బట్టి శిరంబు మీఁద
రాచగొడుగు వెలుంగ భద్రాసనమున
మీర లాసీను లౌట కన్నారఁ జూతు.
ఆసముద్ర వసుంధర యర్పణముగ,
దనరుచుండుట చూతుఁ బాదముల చెంత
ఎంత యేడ్తునో మేల్కొని
యెవరికెఱుక?

ధాత్రియం దెల్ల కులమాన ధనములందు
మహిమమున సంపదను మీరు
మానవేంద్ర ,
గా సవ సమానులంచు నిదాపియెఱుఁగు
కాని వైభవలోభంబు కలిగి కాదు
దాసి భావంబుతో భవత్పద యుగంబు
సేవచేయుచునుందు రాజేంద్రమౌళి!
దీనురాలికిఁ గలకోర్కె దేవ, యిదియె
వననివాసినినై నేను వల్కలములు
దాల్చి ఫలకందముల సంతతంబు దినుచు
నిత్యము కుశాసనంబున నిదుర జెందు
నాకు రాట్సుఖ భోగముల్ నాథ యేల?
గగనమున రోహిణి సుధాంశుఁ
గలిసియున్న
నుర్వి కుముదిని పూజింపదో శశాంకు!యట్లె
దాసిగఁగొనుందు మీ రాట్పదాననన్ను!

చిరతరాభాగ్యనేను! త్యజించిపోయె
నన్ను శైశవమందె నా కన్నతల్లి
ఏమి పాపఫలంబొకో యెఱుఁగ రాను!
పరుల యన్నంబు గుడుచుచు
బ్రదుకుచుంటి
పరులపోషణ మొందుచుఁ బెరుగుచుంటి
ఇపుడు నవయౌవనమున ప్రాణేశ, యేల
నన్నుఁ ద్యజియింప మీచరణాబ్జములకు
దాసినైన శకుంతల దోస మేమి
చేసియుండెనో నృపమణీ, వచింపరాదె?

ఈవనంబున హాయిగా నీవిహంగి
తననివాసమ్మునందుండు తరిని వచ్చి
వ్యాధవేషంబుతోడ ప్రజాధినాథ
ఏమిటికి దాని మీరు హింసించినారు!
అధికులని వింటి మిమ్ముల రథికులందు
ఆర్య భూమిని భీమదోర్వీర్యమందు.
ఖ్యాతి గన్నార, లబలల నబలలైన
నాసుఖమ్మును నాశం బొనర్చి మీర
లేయశంబును గైకొందురో యశస్వి!

జనకు లోకజ్ఞులే తేర వనికి మరల
నిప్పు డీదాసి యేమని చెప్పవలెనో!
ఇప్పు డనసూయ మిమ్ము నిందించెనేని
ఆప్రియంవద దుర్భాష లాడెనేని
వారి కిర్వురి కేమని వల్కవలెనో
ఎట్టుగ దీదాసి మీరే వచింపవలయు
ఈకృశీభూతదేహ మీ కెరగుచున్న
దకట యేమంచుఁ దెల్పుకో నానొ దేవ!

రాజనగరికి నెట్లు చేరంగ వలెనో
ఎట్లు పేరోలగము ప్రవేశింపవలెనో
కానన నివాసినికి నేః థాన దెలియు?

కాని జలమున మున్గసి మానవుండు
పట్టుకొన నెంచు గని వింటె కరకనైన.
నాకు మాదర్శనం బింక గాక పోనె?
జీవితాశ సాజముగ వర్జింతు రెవరు?

# బైటా, లోపల

రవీంద్రనాథ ఠాకూరు

విపిన కిశోరుడు కలవారి యింటి బిడ్డ అందుచేతనే ఖర్చుపెట్ట గలిగిన దానిలో సగమైనా సంపాదించడము అతనికి తెలియదు. కాబట్టి అతడు పుట్టిన యింట్లో చాలా కాలము నివాసము చేయడము సంభవించలేదు.

అతడు చాలా సుకుమారుడు, అందగాడు, పడుచువాడు. సంగీతపు వాద్యాలు వాయించడములో గట్టిచెయ్యి; పనిపాటలలో సున్నా; సంసారవిషయాలలో ఎందుకూ పనికిరాడు; జీవయాత్రలో జగన్నాథస్వామివారి రథమువలె చలనము తక్కువ! పూర్వపు దర్జా యిప్పుడు తప్పిపోయినది.

అదృష్టవశమున, రాజాచిత్త రంజనబాబు 'స్టేట్ ఆవ్ వార్డ్సు' నుంచి ఆస్తి స్వాధీనము కాగా నాటకసమాజము ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నము చేస్తూ, విపినబాబు ముఖలక్షణాలు చూస్తీ, అతనిపాట వినీ, ఇతరులను సంగీతములో తయారు చేసేశక్తిని గ్రహించీ ఆదరముతో అతనికి తనదగ్గర ఉద్యోగ మిచ్చినాడు

ఆ రాజు బి. ఏ. ఆయన కేమీ స్వేచ్ఛాచారము లేదు. పెద్దవంశములో వాడైనా వేళకు భోజనము చేసేవాడు, వేళకు పండుకొనేవాడు. ఇటువంటి వానికి విపినబాబు 'నిషా' మాదిరి అయిపోయినాడు! రాజు అతని సంగీతము వింటూ, అతని గీతినాట్యాలు విమర్శిస్తూ వుండడములో భోజనము చల్లారిపోతూవుండేది, రాత్రి చాలా పొద్దుపోతూవుండేది. ఇంద్రియ నిగ్రహము గలిగిన తన యజమానుని నడవడిలో ఈ విపినకిశోరుని మీది వెర్రిప్రేమ ఒక్కటే దోషమని దివాంజీ అంటూ వుండేవాడు.

రాణీ వసంతకుమారి కోపముతో అన్నది: "దౌర్భాగ్యపుకోతి నొకదాన్ని తెచ్చి, పాడయిపోతున్నావు. దాన్ని దూరంగా వెళ్ళగొట్టితే నాకు ఊపిరి చేరుకొంటుంది."

పడుచుభార్య అసూయపడుతుంటే రాజు తనలో నవ్వుకొనేవాడు. ఇలా అనుకొనేవాడు: 'తాము ప్రేమించినవానినే స్త్రీలు గ్రహిస్తారు. లోకములో ఆదరించ దగిన మంచివాళ్ళెంత మందో వుంటారనే మాట ఆడవాళ్ళ శాస్త్రములో వ్రాసి వుండదు. తమ చెవిలో పెళ్ళి మంత్రాలు చదివినవాళ్ళకే అన్నిగాగవాలు! భర్తభోజనపు వేళకంటె అరగంట ఆలస్యమయితే స్త్రీలకు చాలా కష్టము. భర్తను ఆశ్రయించిన వానిని వెళ్ళగొట్టితే వానికి పిడికెడన్నము కూడా దొరకదనే విషయములో వారికి కావలసినంత ఉదాసీనత!" ఆలోచన లేని స్త్రీల యీపక్షపాతము దూష్యమే కావచ్చును. అయితే, చిత్తరంజన బాబుకు అది అట్టే అసంతృప్తికరముగా లేదు. అందుకనే ఆయన విపిన కిశోరుని అప్పుడప్పుడు ఎక్కువగా పొగడుతూ, భార్యను ఉడికిస్తూ వుండేవాడు.

ఈ రాజకీయఖేలనము పాపము! విపిన బాబుకు సంతోషదాయకముగా లేదు. అంతఃపురములో తనమీద ఇష్టము లేక పోవడముచేత భోజనాదులలో అతనికి మాటిమాటికి ఇబ్బంది కలుగుతూ వుండేది. ధనవంతుల సేవకులు తమయజమానుల అండ జేరిన పెద్దమనుష్యులంటే సహజముగా ప్రతికూలముగా వుంటారు; అందులో రాణిగారికోపము తోడు చేసుకొని, సాహసము చెంది, అతనిని బహువిధాల తేలికగా చూచేవాళ్ళు.

రాణి ఒకనాడు దాసీదాన్ని పిలిచి తిట్లుపెట్టి; "నీ కేమీ పనిలేదు కాబోలు. రోజల్లా ఏమి చేస్తావు?" అన్నది. "రాజుగారి ఆజ్ఞప్రకారం విపినబాబుగారికి సేవచెయ్యడముతోనే రోజంతా గడుస్తూ వున్నది," అన్నది దాసి. "ఛీ! విపినబాబు పెద్దనవాబు కాబోలు!" అన్నది. రాణి మరునాటినుంచి దాసీది విపినబాబు ఎంగిలి ఎత్తేది కాదు. ఎన్నిసార్లో, అతనికి తిన్నగా అన్నము తెచ్చిపెట్టేది కాదు. అలవాటు లేకపోయినా ఎలాగో విపిన బాబు పళ్ళెములు కడుగుకొనేవాడు. ఒక్కొక్కసారి ఉపవాసముకూడా సంభవించేది. అయినప్పటికీ, అటువంటి స్వల్ప విషయాలనుగురించి రాజుతో చెప్పడము అతని కిష్టము లేదు. అతడేనౌకరుతోనూ పోట్లాడి ఆత్మాభిమానము పోగొట్టుకోలేదు. పాపమతనికి ఇంట్లో ఈగలమోత బైట పల్లకీలమోత, అయింది!

"రిహార్సల్" అయి చివరకొకనాడుసుభద్రాహరణ గీతినాట్యము తయారయింది. రాజుగారి మేడ అంగణములో దాన్ని అభినయించారు. రాజు కృష్ణ వేషము వేశాడు, విపిన కిశోరుడు అర్జున వేషము వేశాడు. ఆహా! అర్జునునికంఠము ఎంత సొగసుగా వున్నదో వేషముకూడా అంతసొగసుగా వున్నది. చూచేవారంతా బాగు, బాగు అన్నారు.

రాత్రి పొద్దుపోయిన తర్వాత రాజు వసంతకుమారిని "అభినయ మెలాగున్నది?" అని అడిగినాడు.

"విపినబాబు అర్జున వేషము చాలా బాగా వున్నది. గొప్పవారి కుండవలసిన ముఖలక్షణా లున్నవి ఆయనకు.కంఠము కూడా దివ్యముగా వున్నది" అన్నది రాణి

"మరి, నా ముఖము బాగా లేదు కాబోలు. కంఠముకూడా బాగా లేదనుకుంటాను!" అన్నాడు రాజు.

"మీ సంగతి వేరు!" అని రాణి మళ్ళీ విపిన బాబుసంగతి విస్తరించింది.

ఇంతకంటె చాలా ఎక్కువ మాటలతో రా జదివరకు విపిన బాబు గుణాలు పొగడినాడు. కాని నేడు రాణీనోట ఈమాత్రము ప్రశంస విని, ఆలోచన లేనివాళ్ళు విపినున కున్నశక్తికంటె ఎక్కువశక్తిని ఆరోపించి పెద్దచేసినారను కొన్నాడు. వాడిచక్కదన మెంత! వాడికంఠముమాత్ర మెంత! కొంతసేపు కిందటివరకూ తానుకూడా ఆలోన లేనివాళ్ళలో వాడే. ఇప్పుడు హఠాత్తుగా ఎందుచేతనో వివేచనాశక్తి వికసించింది!

మరునాటినుంచి విపిన బాబుకు ఆహారాదులు సరిగా వస్తూవున్నవి. వసంతకుమారి రాజుతో అన్నది: "విపినబాబును కచ్చేరిలో నలుగురితోపాటు కూర్చోబెట్టడము అన్యాయము. వెయ్యి చెప్పండి, పూర్వ మతనిస్థితి గొప్పది."

"ఆ!" అని రాజు సాక్షేపముగా తేల్చివేసినాడు.

పిల్లవాని అన్నప్రాశనము జరిగింది ఆనాడు నాటకము వేయించమని రాణీ పట్టుపట్టింది. రా జాసంగతి చెవిని బెట్టలేదు.

ఒకనాడు తన వస్త్రముమీద మురికి వున్నదని దాసీదాన్ని రాజు కోపపడేటప్పటికి, "ఏం చెయ్యను? అమ్మగారి ఆజ్ఞప్రకారం విపినబాబుగారి పళ్ళెములు కడుగుతూ, వారిసేవ చేస్తూ, వుండడముతో రోజు గడిచి పోయింది," అన్నది దాసి.

రాజు మండిపడి, "ఛీ! విపినబాబు పెద్దనబాబు కాబోలు, తనపళ్లెములు తాను కడుక్కో లేదు కాబోలు!" అన్నాడు

విపినబాబుస్థితి మళ్ళీ చెడ్డది.

రాణీ రాజును గట్టిగా పట్టుకొన్నది. సాయంకాలము సంగీతము విమర్శించేటప్పుడు పక్కయింట్లో పరదా చాటున వుండి తాను సంగీతము వింటూ వున్నది; విపినబాబు సంగీతము తనకు చాలా యిష్టమన్నది.

భోజనానికీ, పడకకూ రాజు పూర్వమువలెనే సరియైన వేళకు రావడము త్వరలోనే ప్రారంభించినాడు. సంగీతమూ, వాద్యములూ, అన్నీ ఆగిపోయినవి.

మధ్యాహ్నము రాజు జమీావ్యవహారాలు చూచుకొనేవాడు. ఒకనాడుదయమే రాజు అంతఃపురములోకి వెళ్ళి చూచేటప్పటికి రాణీ ఏమిటో చదువుతున్నది.

"ఏమిటి చదువుతున్నావు?" అన్నాడు రాజు.

మొట్టమొదట రాణీ కొంచెము దిగాలు పడ్డది; తర్వాత అన్నది:

"విపినబాబుగారి కీర్తనలపుస్తకములోవి కీర్తనలు ఒకటిరెండు వల్లిస్తున్నాను. హఠాత్తుగా మీకంపెనీ ఎత్తివేయడముచేత సంగీతము వినే ప్రాప్తిలేదు."

కంపెనీ సమూలముగా నాశము చేయడానికి తాను ఇదివరకెంత ప్రయత్నము చేసిన సంగతి ఆమె కెవరూ

జ్ఞాపకము చేయలేదు.

మరునాడు రాజు విపినబాబుకు సెలవిచ్చినాడు; మరునాటినుంచీ అతనికి అన్న మెక్కడ దొరకుతుందో ఆలోచించవలెలేదు.

విపిన కిశోరుని కొక్కటే విచారము నాకు. అతడు రాజునకు నిష్కపటమైన స్నేహము చేసినను; జీతముకంటె రాజుస్నేహమే ఎక్కువగా చూచుకొ

వాడు కాని, ఏదోషమువల్ల హఠాత్తుగా రాజుకు ప్రేమ పోయిందో ఎంత ఆలోచించినా అతనికి తోచలేదు. విపినబాబు నిట్టూర్పు విడిచి, తనపాతతంబురాకు గవిసెనవేసి, స్నేహితులు లేని లోకములోనికి బయలుదేరినాడు. వెళ్ళేటప్పుడు తన జీతములో మిగిలిన రెండు రూపాయలూ రాజుగారి దాసీదానికి బహుమానము చేసినాడు.

## చంద్రార్పణము

చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టి.

చలువఁ జిలుకుచుఁ [illegible]కుచు
వెలుగు వెనుక
వచ్చుచున్నాఁడు, తూరుపు పర్వతంబు
నెక్కుచున్నాఁడు వేవేగ మ్రొక్కరండు
చేతులను జాచి కలువపూచేడెలార!
రాత్రి సామ్రాజ్య మేలఁగ రాజువచ్చె
స్వేచ్ఛ తనువిలాసంబులు ప్రబలె దెసల
ప్రసవకామినులార, సౌరభము లూని
రండు, వేరండు, ఇండు నీరాజనంబు!
లెమ్ము వాసంతికా కాంత లెమ్ము రమ్ము
లేచి రావమ్మ వారిధివీచికాంబ!
మొలకనవ్వును గాంచినావమ్మ కలువకాంత
లేపవే మా శతకిశోరు లేడిపిల్ల!
శారికా బాగు చాలు మస్తాబు సేత!
గొంతు సవరించుకొంటివే కోకిలాంబ!
జీను వేయించుకొన్నావె జింకపిల్ల!
వెన్నెల పులుంగ గజ్జలు వేగఁగట్టు!
చంద్రభగవాను గూరిచి సంతసమున
ఆడుదము పాడుదము రండు అందరమును!

రావోయి నానాథ రావోయి చంద్ర,
రావోయి నాపుణ్యరాశి నాచంద్ర,
రావోయి లోకసంరక్షక చంద్ర!
వచ్చియున్నా మయ్య, భవదీయ దివ్య
నామామృతంబు పానంబు గావింప
గానలోలుఁడ వంచుఁ గంఠంబులెత్తి
పాడుచున్నా మయ్య, పాలించుమయ్య!
నృత్యంబు సేయుచు నినుఁగూర్చిపాడి
హృదయాల నర్పింప నెంచియున్నాము,
భక్తితో మత్తిల్లి పాదాలవద్ద
వ్రాలిపోయెద మయ్య, పాలించవయ్య!
నీవు మా దిక్కయ్య నీవె నాథుఁడవు,
నీవు లేనిది జన్మ నిష్ఫల మయ్య!
రావోయి చల్లనిరాజ రావోయి,
ఆలించి పాలించి అందుకోవయ్య,
ఈభక్తు లర్పించు హృదయాలు దేవ!

---


చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

అయితే పెళ్ళికొడుకు ఏలావుంటాడో చూతామనుకొన్నాను. మాయిద్దరికీ మధ్య అడ్డముగా వున్న బట్టలోనుంచి పెళ్ళికొడుకు రూపరేఖలు కనబడతవేమో అని ప్రయత్నముచేసి చూచాను. కొంతసేపటికి లీలగా ఆకారము కనబడ్డది. మరికొంతసేపటికి అడ్డముగా పట్టిన బట్ట చప్పున తీసివేశారు పెళ్ళికొడుకును చూచేటప్పటికి మా మేనత్తకొడుకే! నాకు చాలా ఆశ్చర్యము వేసింది నేనింకా నిద్రపోతూ వున్నానేమో అనుకున్నాను. ఇలా అనుకొని ఒకమాటు కళ్ళు తుడుచుకునేటప్పటికి పెళ్ళికుమారుడు లేచి నాకంఠాన మంగళసూత్రము కట్టినాడు. నాకు నిద్రపట్టక ముందు జరిగిన సంగతులన్నీ జ్ఞప్తికివచ్చినవి.

ఆరాత్రి స్థాలీపాకము చేయించారు. తలవంచుకొని కూర్చున్నంతసేపూ పెళ్ళికొడుకును నఖశిఖపర్యంతము చూస్తూనే వున్నాను. అదివరకున్నట్టు లేరు వారు; పెళ్ళికొడుకయిన దగ్గరనుంచీ ఏమో వింతగా కనబడ్డారు.

మరునాడు మేజువాణి. మేమిద్దరము పూలబంతులాడినాము. ముత్తైదలు పాటలు పాడినారు. భోగము మేళము కూడా వున్నది. నామనస్సు వీటిమీద లేనేలేదు. పెళ్ళికొడుకే నాహృదయమంతా ఆక్రమించుకొన్నారు.

ఆరాత్రి ఆపోసనము అయిన తర్వాత నేను వెళ్ళి దొడ్డి అరుగుమీద కూర్చున్నాను. అక్కడ యెవ్వరూ లేరు. ఇంతలోకే ఎవరో నాదగ్గిరికి వస్తున్నట్టు తోచింది. తిరిగి చూసేటప్పటికి పెళ్ళికొడుకు నాదగ్గిరిగావచ్చి నిలుచున్నారు! నేను లేవబోయినాను.

'ఏం, పెళ్ళికొడుకును అయినానా లేదా!' అని నవ్వుతూ అన్నారు. సిగ్గుపడి పరుగెత్తినాను.

౪

తర్వాత చాలా కాలమునకు కాపరానికి వెళ్ళినాను. మా అత్తగారు ఒకనాడు అరిసెలు వండుతూవున్నది. నేనామె దగ్గరగా కూర్చుని తింటున్నాను. ఇంతలోకే మావారు సావిట్లోనుంచి చప్పున వచ్చి నన్ను చూసి, 'నాకుకూడా అరిసెముక్కలు పెట్టించవూ?' అన్నారు.

నేను కూర్చున్న చోటునుంచి వెంటనే లేచాను. చేతిలో అరిసెముక్క కిందపడ్డది. నేనక్కడ నిలవక సావిట్లోకి వెళ్ళినాను, వారు నావెంటనే సావిట్లోకివచ్చి, 'బుగ్గలకు నెయ్యి రాస్తావా యేమి?' అన్నారు.

పెళ్ళినాటి సంగతి జ్ఞాపకమువచ్చి నాకు నాకు చాలా సిగ్గువేసింది. అరిసెలు వండవలసివచ్చినా, తినవలసివచ్చినా ఇప్పటికీ నాకు అపరిమితమైన సిగ్గు! ఇంతలో వారు నాదగ్గరకువచ్చి, ఏమేమో నెమ్మదిగా నాచెవిలో అన్నారు. ఆమాటలేవీ నాబుర్రకెక్కలేదు. ఈ స్థితిలో మావారి బుగ్గలకు అప్రయత్నముగా నాచేతిజిడ్డు అంటింది!